# పూర్వోక్తి

---

1912 వ సంవత్సరమున ఏప్రిల్ మాసములో నా ప్రియమిత్రులగు పబ్బతి శేషయ్యసెట్టిగారితో జేరి మహానందీక్షేత్రమున కొంతకాలము నివసించుట సంభవించెను. ఆక్షేత్రము నిర్జనప్రదేశమం దున్నందున కాలయాపనమునకు దగిన యుపాయమును వెదుకవలసి వచ్చెను. ఆ కాలమందు "With the Adepts" అను నాంగ్లేయ భాషలో విరచింపబడిన గ్రంథమును నాకొసగి దానిని కర్నాటకభాషకు బరివర్తనము జేయుడని నామిత్రులు నాకు నియమించిరి. నాయనారోగ్యమును బాటింపక నియమితకార్యమును సాంగముజేసితిని.

కర్నాటకభాషలో నాగ్రంథమును వ్రాయునపుడు భారతీయుల యభిరుచి కనుగుణముగా నది యుండవలెనను భావము నాకు స్ఫురించినందున నవసరములైన

కొన్నిమార్పాటులను గ్రంథములో నచ్చటచ్చట సంద ర్భానుసారముగా జేర్చితిని.

ఈగ్రంథము పాఠకుల కంతరాచరణతత్త్వమును రవం తయైన నాచరింపజేసి దానికై పాటుబడవలెనను సంకల్ప మును వారికి గలిగించినచో నా యీకార్యము సార్థక మైనట్లు భావించెదను.

ఈ గ్రంథమును మొదట తెనుగున వ్రాయదలచి యుండలేదు. ఇటీవల నాకార్యక్షేత్ర మాంధ్రదేశమం దేర్పడినందున నాంధ్రసోదరుల కీ గ్రంథము ప్రయోజన కారి యగునని తలచి తెనిగించితిని. విద్యావిహీనులగు సామాన్యజనులకు సయితము సులభగ్రాహ్య మగునట్లుం డవలె నను యుద్దేశముచేతను, నా కాంధ్రభాషా పరి శ్రమమంతగా లేకపోవుటచేతను వ్యాకరణ నియమాదుల నంతగా బాటింపనైతి. విద్వాంసు లిట్టిదోషములను మ న్నింతురుగాత.

ADYAR,
25-10-14.

M. VENKATA RAO.

# సిద్ధాశ్రమము.

## ప్రథమాధ్యాయము.

---

### పర్వతపర్యటనము.

హేమంతఋతువు అంత్యమై యుండలేదు. వనపఙ్క్తులు, పర్వతాగ్రములు, గ్రామోన్నతసీమలు హిమముచే గప్పఁబడియుండెను. సాధుసంఘమువారి వృత్తాంతమం దాసక్తుఁడైన పథికుడు గ్రామ నగర పట్టణములను జుట్టుచు గ్రంథాలయములను బరిశోధించుచుండెను. తుద కొక పల్లెలోని విరక్తిమఠమున పురాతన గ్రంథమొకటి లభించెను. క్రిమిపీడితపుటములచే నది శిథిలముగా నుండినను పథికుడు దానిని శ్రద్ధగా బరిశోధించెను. తన యభీష్టమునకు దగిన విషయోపపత్తి దొరకినందుకై సంతోషించి దానిని తన స్మృతియందు బదిలముగా నుంచుకొనెను. అంతవరకు జననిలయములయందే సంచరించుచు బలువిధశబ్దములచే గర్ణతాడితుడై యున్నందునను, గ్రంథశోధనాకార్యముచే శ్రాంతుడై యున్నందునను, కొంతకాలము నిర్జన ప్రదేశములయం దుండి

సృష్టిసౌందర్యమును జూచుచు మనః ప్రసన్నతను గలుగ జేసికొనవలయునని వాడు నిశ్చయించెను.

విరక్తిమఠమునుండి ఆలంబుగిరివరకు ధూమశకట మార్గముండెను. కాన వాడొక శకటము నెక్కి జనావాసములేని యాపర్వతపదమును బహుశీఘ్రముగ జేరెను. ఇకముందు వాడు పాదచారియై పోవలసియుండెను.

సాంద్రముగా బెరిగియున్న యున్నతోన్నత వృక్షములతోడను, సుగంధపరిమళము నిచ్చు వివిధ పుష్పగుచ్ఛములతోను, స్వచ్ఛోదకములతో గూడి ప్రవహించుచున్న నిర్ఝరములతోను యాపర్వతరాజ మతిమనోహరముగ నుండెను. పథికుని మనస్సు మహోల్లాసముతో బొంగుచుండెను. జాగుచేయకవాడు ప్రయాణోన్ముఖుడాయెను. మొదట నొక గొప్ప ప్రపాతము తటస్థించెను. దాని ముఖ మతివిస్తారమై యుండెను. ఇరుప్రక్కల నధి యున్నత శిలలచే రక్షింపబడి యుండెను. పథికు డా ప్రపాతమును బ్రవేశించినడవసాగెను. పోనుపోను నాప్రపాతము విశాలమందు తక్కువ యగుచు వచ్చెను. అచ్చటచ్చట శిలాఖండముల క్రింద వ్యవసాయికుల కుటీరము లుండెను.

సూర్యాస్తమయము లోపల పథికు డొక కుటీరమును జేరెను. అది బాటసారులు బసజేయు గృహమై యుండెను.

పథికుని కచ్చోట నతిథిసత్కారములు బాగుగ నడచెను. దేహాయాసమును దీర్చుకొనుటకై వా డారాత్రి యచ్చటనే శయనించెను. మరునాడు వేకువఝామున నడవికి వెడలు మేకల కంఠగత ఘంటికా నినదముచే బథికుడు మేల్కాంచెను. ఆలయముయొక్క కిటికీని కొంచెము తెరచి చూడగా నున్నతశిఖరములచే విలసిల్లు శైలమాల యొకటి గోచరించెను. సిద్ధార్థుని ప్రాసాదమున కెదుట గోచరించుచుండిన మనోహరమైన శైలమాల వాని స్మృతికి వచ్చెను.

శయ్యనుండి లేచి వాఁడు పయనమాయెను. త్రోవలో నొక సెలయేరు పారుచుండెను. మూలమున నది బహుచిన్నదిగా నుండెను. రాళ్లపై గంతులువేయుచు బ్రవహించుచుండెను. అది రాను రాను విశాలమగుచు సమతలమును బొందినపుడు గంభీరముగా బ్రవహించుచుండెను. నాడు నడచుచున్న ప్రపాత మింకను బహుదూరమువరకు బోవుచుండెను. దాని యుభయపార్శ్వ

ములలోను చిన్నచిన్న ప్రపాతము లచ్చటచ్చట నడ్డముగా వచ్చి చేరుచుండెను. ఇరువది సంవత్సరముల క్రిందట పథికుడా ప్రాంత్యమందు సంచరించియుండెను. కాన నవి చాలమట్టుకు వానికి పరిచయము లై యుండెను. ఒక్క ప్రపాతమును మాత్రము వాఁ డెఱుఁగడు. అది రెండు భాగములుగా నిర్మింపబడిన యొక శిఖరమునకు వెళ్లుమార్గముగా నుండెను. దుర్గమ మార్గముగా నున్నందున నరపాదస్పర్శమే యరుదై యుండెను. అట్టి మార్గమునకు పథికుని పాదము లాకర్షింపబడెను. అన్యాదృశమైన యేశక్తి ఈపనిని జేసెనో వానికి తెలియ లేదు. ఆమార్గమందు చాలమట్టుకు తన యభీష్టము సిద్ధియగు ననియు, గ్రంథశోధనచే దొరకని పరమరహస్య మచ్చోట లభించవచ్చు ననియు వాడు భావించెను.

సూర్యుడు తన నిత్యసంచారము నారంభించి యుండలేదు కాన త్రోవయంతయు చీకటిగా నుండెను. ఉభయ పార్శ్వములయందు ఘోరారణ్యముః లుండెను. త్రోవ యేటవాలుగా నుండెను. పథికుఁడు దాని నారోహించిన కొలఁది నరణ్యములు తెల్లబారుచు వచ్చెను. బహువేగముగా ప్రవహించుచున్న సెలయేటి ఘోష ప్రబలముగా విన

వచ్చుచుండెను. దారి నడువ నడువ నాఘోష తక్కువ యగుచువచ్చెను. కొంతదూరము నడచిన పిదప పథికుడు వెనుకకు తిరిగి జూచెను. దట్టమైన ఘోరారణ్యము లగు పడెను. మరల ముందరి త్రోవను జూచెను. దుర్గమ మైన పర్వతశిఖరములు గోచరించెను. మరల నడువ సాగెను. కొంతదూరములో నొక జలపాత శబ్దము విన వచ్చెను. అది పర్వతాగ్రమునుండి బయలువెడలి శిలలను భేదించుకొని యతివేగముగా ప్రవహించు చుండెను. దానియలలు రాళ్ల నడుమ పగిలి నురుగును బుట్టించు చుండెను.

ఆ సెలయేరు ప్రవహించుచున్న తావున తృణ పల్లవములచే సాంద్రము లై యున్న చిన్నచిన్న ద్వీపము లచ్చటచ్చట నేర్పడియుండెను. ఘోరారణ్యముల మధ్య విడివిడిగా నున్న నిమ్నోన్నత ప్రదేశములవలె నవి కన బడుచుండెను. కాని వాని యధోభాగమును జలవా యువు లేకీభవించి దినదినమునకు బలుచగా జేయుచుం డెను. ఎంతకాలమునుండి యీపని జరుగుచుండెనో తెలి యదుకాని పథికుడు చూచినపుడు చిన్నచిన్న పాదముల పై నిలిచిన శిలాపఙ్క్తులవలె నాద్వీపములు గోచరించు

చుండెను. చూచుటకు గఠినముగా నున్నను కాలక్రమ మున పదస్ఖలితముచే గ్రుంగిబోవున ట్లుండెను.

పథికునిత్రోవ యొకచోట నిర్ఝరమును సమీపించుచు, మరియొకచోట దూరముగబోవుచు సాగుచుండెను. ఉన్నతశైలముల నెక్కుచు, లోతైనమంచుప్రవాహముల యడుగుభాగమునకు దిగుచు పథికుడు నడువసాగెను. ఇట్లు బహుదూరము నడచిన పిదప పైభాగమందున్న యొకశిలపై సూర్యకిరణములు గోచరించెను. దాని కావల ప్రపాతమంతయు సూర్యరశ్మిచే బ్రకాశించుచుండెను. వృక్షముల పై మందమారుతము వీచుచుండెను. శాఖాగతములైన యాకులు చలించుచుండెను. స్వభావగాయకులైన కోకిలాదివిహంగములు గానము జేయుచుండెను. అచ్చోట నున్న ప్రాణికోటియంతయు నా గానమును విని యానందమగ్నమై యుండెను. దినవ్యవహారముల కాగానము మంగళవాద్యముగా నుండెను.

రాళ్లు, గోడలు స్ఫుటముగా గోచరించ నారంభించెను. బద్ధలై యున్న శిలల మధ్యప్రదేశములు మా

త్రము సూర్యకిరణముల నింకను పరిగ్రహించు చుండ లేదు. పథికుడు వెనుకకు దిరిగి చూచెను. ప్రపాతము విస్తారమైన తనముఖమును తెరచుకొని యుండెను. సెల యేరు సమతలమును జొచ్చి, విస్తరించి యచ్చటచ్చట గాసారము, తటాకము, హ్రదము మొదలగు జలాశయములను గల్పించుచు బ్రవహించు చుండెను. ప్రపాతమున కెదుట నున్నతశిఖరములు, వాని మధ్యభాగమునుండి బయలువెడలిన మఱికొన్ని యున్నత తరశిఖరములు నంతరిక్షమువరకు వ్యాపించి యుండెను. భూతలమున బచ్చని పైరులతోను, పార్శ్వములయందు రాళ్లనలుపు మొదలుకొని శిఖరముల ధావళ్యమువరకుగల పలువిధములైన రంగులతోడను నాశైలమాల గోచరించు చుండెను. బద్ధలైయున్న శిలల మధ్యభాగమున నుండియు జెట్లకొమ్మల మధ్యమున నుండియు సూర్యుడు ప్రకాశించుచుండెను. అహర్మండలము సమీపమున నున్నట్టు సూచన కలిగెను. ప్రపాతమును బ్రకాశింపఁ జేయక మునుపే సూర్యుడు తన తేజము నున్నతశిఖరములకు గరుణించుచుండెను. పర్వతాగ్రముపై దనపూర్ణకళలతో సూర్యుడేతెంచెను. క్రిందిభాగమందున్న యంధకార మంతయు నదృశ్యమాయెను. ప్రపాతము తేజోమయ మయ్యెను.

వృక్షములచే సాంద్రమైన వనపఙ్క్తులు శిలలచే నావరింపబడిన గుహాలు ప్రకాశవంతము లయ్యేను.

పర్వతాగ్రమునుండి వంగియున్నప్రదేశ మొకటి పథికునకు గోచరించెను. దానిని జట్టుకొని వాడు నడువవలసియుండెను. తలయెత్తి తనత్రోవను వీక్షించెను. తాను నిలిచియున్న స్థలమునకును పైభాగమున నగుపడుచున్న ప్రదేశమునకును మధ్య వృక్షశూన్యమైన యొకబయలుండెను. దానిలో నెచ్చట జూచినను రాళ్లే నిండియుండెను. పరీక్షింపగ నారాళ్లు బ్రద్దలై పైభాగమునుండి పడియుండులాగునతోచెను. అచ్చటచ్చట పాచి, గుల్మలతాదులుగోచరించుచుండెను. లతలు కొన్ని పర్వతముల నెక్కగోడలవరకు వ్యాపించియుండెను. ముందు వెళ్లక శిలామయపాలకులచే నిరోధింపబడియుండెను. అందువలన నవి వెనుకకు మరల ప్రపాతమువంక నధోముఖముగా వెళ్లి యుండెను. ఇట్టి వ్యాప్తినిరోధములు వానికి బహుకాలముగ దటస్థించుచుండెను. స్థిరాస్థిరవర్గములకు జేరిన యాశైల - లతశత్రువులకు జరుగుచుండిన సంగ్రామమునం దుభయసేనల ముమ్మరము ప్రతిసంవత్సరము కొంతవ్యత్యాసముగుచుండెను. శిలామయపాలకులు నిత్య

తత్వములవలె సుస్థిరముగ నిలిచి యుండిరి. లతాగుల్మము లచే దండయాత్రచేయబడుచుండు వారిరాజ్యము మాయచే నాక్రమింపబడు సత్యరాజ్యమువలె గోచరించుచుండె ను. తుద కా శిలామయపాలకుల పరివారమునకు జేరిన కొన్నిశిలలు తమశత్రువ్యూహముపై బడి పచ్చగనున్న తమవైరులను ప్రతిసంవత్సరము నిపాతముజేయుచుండెను. జీవునికి మరణములేదుకాన శిలలు పడుటచే నశించిన గుల్మలతాదులు మరియొక రూపమును బొందుచుండెను.

రమ్యమైన యాప్రదేశమును జూచుచు గొంతకాల ముండి పిదప పథికుడు మరల పయనమాయెను. ఒకదూర జలపాతమునుండి ప్రవహించుచున్న నిర్ఝరమునుజూచి దానియొద్దుననే నడువ నారంభించెను. అదిలోతైన దైనను దానిలోని నీరు శుభ్రిముగా నుండుటచే నొకచిన్న రాతిని దానిలో వేసినను నదియడుగున గోచరించు చుండెను. ఒక్కొక చోట నాయుదకము నిశ్చలముగానుండు టచే సూర్యప్రభచే బ్రవిష్టమైన జలమయస్ఫటికము వలె నగుపడు చుండెను. మరియొకచోట తన్ను నడ్డగించు రాళ్లపై గోపము జెందినట్లు నురుగును బుట్టించుచు నా నిర్ఝరము బ్రవహించుచుండెను. ఇంక నొక చోట చిన్న

చిన్న రాళ్లపై గ్రుంగుచు వివిధములైన వన్నెలను ప్రదర్శించు చుండెను.

ఏకాంతమగు నాస్థలమందు నరుని స్మరణమునకే యవకాశముండలేదు కాని యచ్చటచ్చట వృక్షమూలములు రంపముచే గోయబడి యుండినందున లయశక్తి సూచకమైన నరుని కార్య మచ్చటను గలదని తెలియవచ్చుచుండెను. ఎండిన కొన్ని వృక్షముల కోటరములలో వర్షోదకము నిండియుండినందున వానిపై సూర్యరశ్మిపడిన వెంటనే యవి చిన్న చిన్న యద్దములుగా బ్రకాశించుచుండెను. అవి జలకన్యకలకు దగిన దర్పణములుగా నగపడుచుండెను. వానిపార్శ్వములయందు బెరిగియున్న కుక్కగొడుగులు దేవతావ్యక్తుల కుపయోగకరములైన పరికరములుగా నుండెను.

తాను నిలిచియున్న ప్రదేశమందు ముండ్లచెట్లును పాచియు నచ్చటచ్చట బెరిగియుండెను. చెట్లలోనియాకులు సూర్యరశ్మియందు మెరయుచుండెను. సమీపమున నొక దేవదారు వనముండెను. పథికుడు దానింబ్రవేశించెను. ఒక దేవదారు వృక్షముక్రింద నీడలో పాచిపై బరుండి

ప్రకృతి సౌందర్యమును బరీక్షింప నారంభించెను. మొట్ట మొదట దూరమున బ్రవహించుచున్న పర్వతప్రవాహ మొయొక్క ఘోషము వినవచ్చెను. తనకెదుట నొక జల పాతము గోచరించెను. శిలలపైబడునపు డది జలకణముల నెగిరించుచుండెను. ఇంద్రచాపమున వ్యక్తములగు సప్త వర్ణము లాకణములయందు గోచరించుచుండెను. ఆబిం దువు లొక రాతితొట్టిలో బడి దాని బిలమార్గమున మరల ప్రపాతమునకు బ్రవహించి తన సోదరితో జేరుచుండెను.

పథికుడు చాలప్రొద్దు నీరాటమును జూచుచుండెను. వింత వింతలైన వ్యక్తులు వానికి గోచరింప నారంభించెను. అందమైన అతిభౌతికవ్యక్తులు తమజడలనుండి జలబిందు వులను స్రవింపజేయుచు సూర్యప్రకాశమం దతి మనోహ రముగా గ్రీడించుచుండెను. ఆమూర్తుల సంతోషోల్లాస ములు ప్రశస్తతమములైయుండెను. శిలలయడుగున వికార రూపములుగల ఘోరవ్యక్తులు పై భాగమున గ్రీడించు చున్న దేవవ్యక్తుల జలక్రీడను గపట భావముతో నిక్కి నిక్కిచూచుచు నసూయపడుచుండెను. ఏటవాలుగా బ్రవ హింప సందేహించునట్లు పైభాగమున జలప్రవాహ ము గోచరించుచుండెను. అడుగున తొట్టినుండి బయలు

వెడలు నిర్ఝరము తన స్రోవకడ్డముగానున్న రాళ్లపై నాగ్రహముచేతను, తన సోదరిని విడువవలసి వచ్చెనను చింతచేతను మనోవికారమును బొంది ప్రవహించు చుండె ను. కొంతదూరమున మరలనదితనసోదరితో జేరి వియోగ దుఃఖమును బోగొట్టుకొనుచుండెను. ఇట్లుభయశాఖలు మనస్సామరస్యమును బొంది సుఖసంతోషముల ననుభ వించుచుండెను.

సృష్టిలోని కొన్నివస్తువులు నిర్జీవములై యుండ వానికి మానుషప్రజ్ఞను యనుభవశక్తిని మనమెందు కారోపించెదము? సుఖసమయములయందు మానవుడు తానొక దేహియనియు, తన ప్రజ్ఞ దేహమనెడి కారా గారము నేలాగైనను విడిపించుకొని సార్వత్రిక చైతన్యమం దైక్యము నొంద యత్నించుచున్నదని యుజ్ఞప్తి కేల తెచ్చికొనరాదు? మానవునిప్రజ్ఞ దేహ భూతములయొక్క పనిచే గలిగినదా లేక దేహమనెడి దర్ప ణమందు సంగ్రహింపబడిన సార్వత్రిక చైతన్యముయొక్క యంశముగా నున్నదా? ఆప్రజ్ఞకు స్థూలదేహముండు టావశ్యకమా? దేహమునశించిన ప్రజ్ఞకూడ నశించు చున్నదా? లేక, మనుష్యుని నాశరహితమైన భాగమునకు

జేరి శాశ్వతమైన వస్తువుగా నాప్రజ్ఞయున్నదా? శాశ్వత మైనదిగా ప్రజ్ఞయుండినచో దేహమందు కొంతకాలము నివసించియుండి దాని విడిచిపోయిన పిదప యథాప్రకారముగా నుండనక్కరలేదా? స్థూలదేహమనునది మానవునిప్రజ్ఞ పనిచేయునిమిత్త మేర్పడినయొక సాధనమాత్రముగా నున్నయెడల మానవుడు తనదేహము కాజాలఁడు గదా? ఇది నిశ్చయమైనచో తనదేహము నశించినను మానవునికి నాశములేదు.

పక్షులవలె పర్వతాగ్రము చుట్టుపారుచు నచ్చట నుండువస్తువులను పరిశోధించు సామర్థ్యము మనకున్నదని భావించిన యీభావములవెంబడి మనముకూడ వెళ్లిసుఖోల్లాసముల ననుభవించ వచ్చునుకదా? దుర్గమప్రదేశముల నెక్కగల సామర్థ్యములేని మనస్థూలదేహమును వదలికదా మనమచ్చోటికి వెళ్లెదము! దేహమును వదలి మనము వెళ్లునపుడు దేహధర్మములు చక్కగా నడచుట కొరకు మనము మనప్రాణశక్తియొక్క యొకయంశమును దానిలో ప్రతిష్ఠజేసి వెళ్లుచున్నాము. స్వప్నచారులు సమాధినిష్ఠ నభ్యసించినవారు తమతమ దేహములను విడిచి ప్రజ్ఞకు సహజముగానున్న శక్తులతో దూరదేశము

నకు వెళ్లి యచ్చట తా మనుభవించిన సంగతులను జ్ఞాపక ముంచుకొని మరల స్థూలదేహమునకు వచ్చినపు డాసంగతులు యథార్థములుగా నున్నట్లు మనము వినియుండ లేదా?

చైతన్యము స్వభావసిద్ధముగా నుండినచో నది నిర్జీవ వస్తువని మనముచెప్పెడు ప్రతియొక పదార్థమందుకూడ యుండవలయును. జగమందు మృతపదార్థము గలదా? తుచ్ఛములగు రాళ్లను పరీక్షించి చూచినను వాని యణువులు పరస్పరముజేరి యుండవలయునన్న నొకశక్తి విశేషము కావలయును. అవి యెగిరిపోక భూమినంటుకొని యుండవలసినయెడల భూమికి వాని నాకర్షించు శక్తి యుండవలెను. శక్తులన్నియు చైతన్యయుక్తములుగా నున్నవికదా! చైతన్యమే యంతస్తత్వము. జడపదార్థము ప్రవర్ధమాన మగుటకు చైతన్య ముండక తప్పదు. కనుక, స్వభావ వస్తువులకు ప్రాణమున్నది, చైతన్యమున్నది. జడమయమైన మనస్థూలదేహమున కతీతముగా సూక్ష్మమైన మరికొన్ని దేహములున్నవని చెప్పుదురు. అది నిశ్చయమైనచో నాత్మస్వరూపులమైన మనకు నవి స్థూలదేహము వలె గోచరించవలసినవే కదా! కనుక, అతిభౌతిక దేహములనుకూడ మనము చూడగలుగుదుము.

ప్రకృతియంతయు మౌనముగా నున్నపుడు మన సంకల్పములు జాగ్రత్స్వప్నములుగా బరిణమించుచున్నవి. స్వప్నములు యథార్థములుగా గోచరించుచున్నవి. మనస్సామరస్యముగల సన్మిత్రులతో జేరి పవిత్రతమమైన నిర్జనప్రదేశమందు వాసముచేయుచు దన భావికాలమును గడపునంతటి భాగ్యము తన కేలాగున లభించునో యని పథికుడు చింతించెను. ఏకోద్దేశముగల మిత్రులొకచోట జేరి పనిచేయ నారంభించినచో జ్ఞానసుఖము లత్యంత సులభముగా లభించవచ్చునని తలచెను. జనసామాన్యులు తమజన్మమును గూర్చి లోతుగా విచారించుట యరుదు. అట్టివారికి గూడ తానున్న ప్రదేశమందు మనోవికాసము, చిత్తైకాగ్రత, జీవజగత్తుల జ్ఞానము తప్పక కలుగునని పథికుడు భావించెను. ఆహా ! శాంతనిర్మలమైన యీస్థలమం దింద్రియములు బాహ్యవస్తువులను గాని, యాంతరంగిక పదార్థములను గాని యెంత చక్కగ బరిగ్రహించ గలవు! ఆత్మజ్ఞానము సయితమెంత యతిశయముగా బ్రకాశించవచ్చును! గతానుగతికమైన లోకమార్గముతో బనియేమి ! ప్రపంచ మనెడి మూర్ఖాలయమున నేమి నడిచిన నాకేమి? దానిని గ్రహింప నవసర మేమి యున్నది ? కుత్సితములైన లోకమర్యాదా

విధానములు, నుపాయములు, ప్రతిబంధకములు, నీ ప్రదేశమును బొందనేరవు. వానికి లోబడినవాడు బహిర్ముఖు డగుచున్నాడు; తన కసమ్మత మైన పనిని జేయుచున్నాడు; తన కిష్టము లేని ప్రదేశమునకు వెళ్లుచున్నాడు; తన కభిమతములుగాక విలక్షణములైన లోకసంప్రదాయముల నారాధించుచున్నాడు. ఇట్టి జీవితముచే లోకమునకును, మనకు నెట్టి ప్రయోజనము కలుగవచ్చును ? జగమువలె మానవుడు సహితము సంకల్పాత్మకు డై యుండుట నిజమైనచో తనసంకల్పములను బరిశీలించి సవరించుకొనుట కింతకంటె సానుకూలమైన స్థలము మరియెచ్చటను దొరకదు. నరుని కోరికలుగాని సంకల్పములుగాని భ్రాంతిసిద్ధములుకావు. లోకమందు ప్రత్యక్షముగా గోచరించు వస్తువులవలె నవి యథార్థములు. వానికంటె నెక్కువకాలము జీవించియుండును. తమ్ము నావరించికొనియున్న రూపముల నణచినప్పటికి నాయాశా సంకల్పములు వేరురూపములతో గోచరించుచున్నవి. ఫలప్రదర్శకవస్తువులవలె నవి పుట్టి పెరుగుచుండుట యథార్థమే. పరిపక్వ మైనకొలది యవి సూక్ష్మాకాశమం దంకిత మగుచున్నవి. పరిగ్రహించు సామర్థ్యము గలవారల కవి యగపడుచున్నవి. ఉత్తమసంకల్పములనే పరిగ్రహించి,

వానిని మరికొంత శుద్ధముగ జేసి వెల్లడిజేయు సామర్థ్య మెవరి కున్నదో వారేకాంతవాసులై నిర్జనభూములయం దుండుటచేత లోకమున కతిశయతరమైన యుపకారము ను జేయవచ్చును. జనసమూహమున నత్యల్పవ్యవహార ములచే నాటంకములు కలుగుచున్నవి. దేహము నశించినను సంకల్పములు నశించవు. ఆకాశమందు స్థిరముగ సంకితములై యుండి స్మృతిమూలమున గ్రాహ్య ములగుచున్నవి.

మానవు డన నెవడు? మాంసాస్థిస్నాయు మేధో మజ్జములతో గూడిన దేహము నశ్వరమైనను జనసామా న్యులు దానినే మానవు డని పురస్కరించెదరు. దానిమ ర్యాదను గౌరవపరాక్రమములను, నీతిని కాపాడవలెనని వా రెంతో ప్రయాసపడుదురు. పశువుల శరీరమునకును మానుష దేహమునకును వ్యత్యాస మేమైననుకలదా? బుద్ధియొకటి యధికముగా నుండుటవలనకద్దా మనుష్యు డితరప్రాణులకంటె నుత్తము డనిపించుకొని యున్నాడు? బుద్ధి జడసంసర్గముచే గలిగినదా? అది దేనివలన పనిచే యుచున్నది? బుద్ధికి మూలకారణము దేహాతీతమై యుండ పనిలేదా? బుద్ధిలేక మానవు డుండునా? బుద్ధి

ఆత్మయొక్క శక్తివిశేషముగా నున్న మానవు డాత్మ స్వరూపు డని భావించవచ్చునా?

పథికు డిట్లు తనలో దా నాలోచించి కొనుచుండ బార్శ్వమున నొక ప్రహసనము వినవచ్చెను. అదే మని చూడగా పర్వతశ్రేణి వాసులగు "క్రూతుల" లో నొక వామనమూర్తి పార్శ్వమున నిలిచియుండెను. పథికుఁడు భావనాపరంపరలో మగ్నుడై యున్నపు డావి లక్షణమూర్తి వాని పార్శ్వగతుడై యుండవచ్చును. తన కార్యమునకు భంగ మొనరించినందుకై యావామను నిపై కోపగించుకొని పథికుడు "నీకేమి కావలయును" అని బిగ్గరగా బలికెను.

బుద్ధిమాంద్యమును బ్రదర్శించుచున్న యాదూత శిఖామణి దంతపఙ్క్తుల రెంటిని దెరచి "నిన్ను తనయా శ్రమమునకు తీసుకొనిరమ్మని నాస్వామి యాజ్ఞాపించినా డు" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆవాక్కులచే విస్మయ మొంది "నీస్వామి యెవరు?" అని పథికుడు మరల బ్ర శ్నించెను. "ఆజ్ఞాకారకుడు" నాస్వామి యని దూత పల్కెను. అట్లు పల్కునపుడు వానినేత్రములలో బుద్ధి

కుశలతా చిహ్నముండెను. వాక్కులో భృత్యుని విధే యత గోచరించెను. వాని స్వామివిషయమై మరికొన్ని సంగతులను దెలిసికొనవలె నని పథికుడు తలచెను కాని యీదూత మూఢుడని మరల బ్రశ్నించలేదు. వాని వెంబడివెళ్లి యేమి తటస్థించునో చూచెద నని పథికుడు నిశ్చయించికొనెను.

దూతనడువసాగెను. పథికుడువానిని వెంబడించెను. దుర్గమ పర్వతముయొక్క పదతలమును వా రిరువురును జేరిరి. తన్ను వెంబడించుచున్నాడో లేదో కనుగొను నిమిత్తము దూత త్రోవనడచునపు డప్పుడప్పుడు వెను కకు దిరిగిచూచుచున్నందున పథికుడు వాని ముఖభావ మును, వేషమును, బరీక్షించిచూడ వీలై యుండెను. ఉన్నతమం దాదూత మూడడుగులుండెను! కాషాయ వస్త్రముతో గట్టిన నిలువుటంగీని శిరము మొదలు పాద ములవరకు ధరించి యుండెను. శిరస్సు నందొక పడగ యుండెను. వానికాళ్లు పలుచగనుండెను. కాయగ్రీవ ములు వానిపలుచనికాళ్లపై బరువుగా నిలువబడియుం డెను. పాదములు గొప్పవిగా నుండెను. వాని దేహాకా రమును, ఆరోగ్యముఖమునుజూచిన పసిబాలుడై యుండ

వచ్చునని యూహించుటకు కారణముండెను. కాని వాని ముఖమునుండి వ్రేలాడుచున్న గడ్డము తెల్లగానున్నందున వాడుబాలుడు కాడని తెలియవచ్చెను. హస్తమందొక దండముండెను. అదియొక చెట్టుకొమ్మగా నుండెను. దారిలో వాడు దానిని సంగ్రహించి యుండవచ్చునని పథికునికి దోచెను.

ప్రథమాధ్యాయము సంపూర్ణము.

# సిద్ధాశ్రమము.

## ద్వితీయాధ్యాయము.



### మఠము.

నిర్ఝరపార్శ్వమున నొకత్రోవ యుండెను. దాని వెంబడి పథికుడు దూత ననుసరించి వెళ్లెను. ఆ పర్వత ప్రవాహము యొక్క యథోభాగమున స్ఫటికశిలలు సాంద్రముగా బఱచబడియుండెను. ఆ యేరు పోనుపోను వైశాల్యమందు తక్కువయగుచు వచ్చినందున సమీపమందే దాని మూలముండవచ్చునని పథికుడూహించెను. ఆశ్చర్యకరమగు గుప్తశైలము సమీపమగుచు వచ్చెను. దానిరాతిగోడలు దీర్ఘోన్నతములుగా నిలిచియుండెను. గగనచరములగు పక్షులు తప్ప మరియేప్రాణులు దాని నారోహించుచుండలేదు. గోడలలో నొకవైపున బిలద్వారము బోలె యొకద్వారముండెను. దానిం బ్రవేశించి పయనముచేసిరి. కొంతదూరము వెళ్లిన పిదప మరియొక

గోడ తటస్థించెను. దాని కొక సురంగమార్గముండెను. దానిం బ్రవేశించి వా రాగోడను దాటిరి. గొప్పప్రపాత మొకటి గోచరించెను. దాని స్వభావసౌందర్య మతి మనోహరమై యుండినందున పథికునికి మనోల్లాస మతిశ యించెను.

ఆ ప్రపాతమున కున్నతములైన పర్వతములే కోట గోడలుగా నేర్పడియుండెను. ప్రకృతికి సహజమైన వస్తు రచనాశక్తి, మానవుని బుద్ధి కౌశల్యమును జేరి యాప్ర పాతమున కొక విధమైన నిరుపమాన సౌందర్యమును కలుగజేసియుండెను. అతివిస్తారమైన ముఖముగలదై యుం డుటచేత నాప్రపాతము మహాసముద్రముయొక్క యఖా తమువలె గోచరించుచుండెను. నలువైపుల బహుదూ రమువరకు వ్యాపించి యర్ధచంద్రాకృతిగల రంగస్థలము వలె కనబడుచుండెను. హ్రాస్వములైన తృణపల్లవములు, రమ్యములైన తరువులు, సాంద్రతరములగు వనాటవులు, చిన్న చిన్న తటాకములు, సోల్లాసముగా బ్రవహించు నిర్ఝరములు నాప్రదేశమును శోభాయమానముగ జేయు చుండెను. దూరమం దొక బిలము మహామంత్రబలముచే శిలామయముగా నిర్మింపబడిన ట్లగుపడు చుండెను.

పర్వతపార్శ్వము లోకవైపున నేటవాలుగా దిగి మరి యొకవైపున నున్నత సీమకు వ్యాపించియుండెను.

ఇట్టిప్రకృతి సౌందర్యమందు పథికుని మనస్సు విలీనమైనందున వాడు నిశ్చేష్టితుడాయెను. వానిమనఃస్థితిని గ్రహించి దూత చిరునవ్వునవ్వుచు మౌనమును వహించెను. శుక్లకృష్ణ వర్ణములతో మిశ్రముగానున్న శిలలపై నేటవాలుగా బ్రవహించుచున్న జలపాతముయొక్క ఘోష యొకటిలేకుండిన నా ప్రదేశమందు బ్రకృతియంతయు నిశ్శబ్దముగా నుండియుండును. ఎడతెగనిదానిపతనము నిత్యరాజ్యమునబ్రవహించు కాలప్రవాహము ననుకరించియుండెను. తానదివరకెన్నడు ననుభవించని నూతన ప్రపంచ మందున్నట్లు పథికునికి స్ఫురించెను. పరిశుద్ధమైన నూతన వాయువు వీచుచుండెను. సూర్యప్రకాశ మతిశయించెను. పైరుపచ్చలు మనోహరముగా నుండెను. సుఖసంతోషముల కాకరమైన స్వర్గము, శాంతికి నిలయమైన పరమపదము నచ్చోటనే వానికి గోచరించెను.

నలువైపుల గొంతతడవు విలోకించి పథికుడు పరవశు డయ్యెను. గమనోద్యోగస్మృతిచే మేల్కొని శిర

మెత్తిచూడగా శిఖరాగ్రము గోచరించెను. అది ప్రాసాద శిఖరమో, కోటగోపురమో, లేక మఠగోపురమో చెప్పజాలని స్థితిలోనుండెను. సమీపించినకొలది యొక మందిరము గోచరించెను. దాని గోడలు నలువైపుల నున్న వృక్షములకంటె నున్నతములైయుండెను. దేవాలయమునకువలె దాని యూర్ధ్వభాగమున గోపురముండెను. దానిగోడలు దృఢములైయుండెను. ఆకారమున నామందిరము సమకోణములు గలదిగానుండెను. శిల్పశాస్త్రానుసారముగా గట్టినమందిరమువలె గోచరించలేదు. దాని కనేకగవాక్షము లుండెను, బురుజులుండెను, గదులుండెను, వారపాకులుండెను.

ప్రపాతమునకావలనున్న ప్రదేశము స్వభావసౌందర్యమందుగాని, రమ్యతలోగాని కొదవగానుండలేదు. దీర్ఘోన్నతములైన శ్వేతశిలలు నీలాకాశమును స్పృశించుచుండెను. ధరణీతలమునుండి లేచియున్న శైలములకు నాయా శ్వేతశిలలకునుమధ్య మేఘమండలమేర్పడి యుండెను. అది పర్వతమునన్నివైపుల నావరించుకొని లయప్రపంచమును సూచించుచు నొకచోట నంధకారమును మరియొకచోట ప్రకాశమును ప్రదర్శించు చుండెను.

బిలములందును, శైలముల మీఁదను మంచుగడ్డలు లేకున్న నా ప్రదేశమంతయు శిలార్ణవముగా గోచరించియుండును.

పయినము బహుదూరము సాగెను. ఇరుప్రక్కల వరుసగా బెరిగిన తరువులతో సాంద్రముగానున్న యొక విశాలమార్గము గోచరించెను. మనోహరుడును హావభావయుతుడునగు మహాపురుషుఁ డొకడామార్గమున గంభీరముగా వచ్చుచుండెను. అతడు కాషాయవస్త్రములను ధరించి యుండెను. శిరమునుండి నల్లని వెంట్రుకలు వ్రేలాడుచుండెను. కందుక చలనమువలె పదచలనము గావించుచు నడచుచుండెను. అతని సందర్శనమైన వెంటనే దూత ముందుకెగిరిపోయి దీర్ఘప్రణామంబు గావించి స్వప్నపురుషునివలె నంతర్ధానుఁ డాయెను.

ఈ విచిత్రసంభవమును జూచి పథికు డాశ్చర్యభరితుఁడాయెను. మహాపురుషుడు స్వాగతమును గరుణించుచు దనయొద్దకు వచ్చుచుండినందున నాసంభవము యొక్క రహస్యమును విచారించను వీలులేకపోయెను. పథికుని యావత్కరణము లా మహాపురుషునిపై నెగడెను. ఆ

మహనీయుడు సుమారు ముప్పదియైదు సంవత్సరముల వయస్సుగలవాడై యగుపడెను. దీర్ఘకాయముచే గంభీరముగా నుండెను. అతనిముఖమం దమోఘమైన దివ్యతేజస్సు ప్రకాశించుచుండెను. కరుణామయ దృష్టిచే పథికుని జూచెను. ఆదృష్టియందు వాని యాంతరంగిక స్వభావమును బరీక్షించు భావముండెను. చూచినవెంటనే యతడు మహాత్ముడని పథికునికి స్ఫురించెను.

వాని మనోభావము నా మహనీయుడు తత్క్షణమే గ్రహించి యిట్లు పలికెను.

మహాపురుషుడు:— అవును: నీ వెవరివిషయమును సదా యాలోచించుచు బరిచయము చేసికొనవలె నని కుతూహలముతో నుంటివో యా మహనీయుల సమీపమునకు నీవిపుడు వచ్చియున్నావు. వారిని నీకు త్వరలో చూపించెద.

పథికుడా మహాపురుషుని ముఖమును వీక్షించెను. బహుకాలమునుండి పరిచయమై యున్న ముఖముగా దోచెనేకాని క్రొత్తముఖముగా గనుపడలేదు. తనస్మృతి భండారమునంతయు వెదికి చూచెను. ఎచ్చటను యా

వ్యక్తికి స్థానముండులాగునగోచరించలేదు. ఎప్పు డెచ్చట నతని లేక యతనివలెనున్న మరియొకపురుషుని జూచి యుండవచ్చునని జ్ఞాపకము తెచ్చుకొనుటకు యత్నించెనుకాని యది సార్థకముకాలేదు. ఈభావమును గుర్తెరిగి మహాపురుషుడు చెప్పసాగెను.

మహాపురుషుడు:— నీయూహసరియే. మనమిద్దరము క్రొత్తవారముకాము. నీకు గోచరించకనే నీవద్దనుండినే ననేక వేళలయందు నీమెదడుకు నూతనభావనల నంకితము జేసియున్నాను. వానినన్నిటిని నీవు విశదముగా వ్రాయుచుంటివి. ఇదిగాక, పశుప్రాయమగు నీయాస్థూల దేహము నిద్రించుచుండఁగా నీ వనేకమారు లీస్థలమున కేతెంచి నాతోడను నీయాశ్రమ వాసులగు నితర సోదరులతోను సంభాషణము జేసియున్నావు. కాని మేల్కొనిన పిదప నాసంభాషణ లొకటియు నీస్మృతియం దుండడములేదు. నీయీపశు దేహనకు బాహ్యేంద్రియములద్వారా యంకితములగు సంగతులను జ్ఞాపకముంచుకొను సామర్థ్య మున్నదే కానియూర్ధ్వలోకములయందు నీవనుభవించు సంగతులను స్మృతియం దుంచుకొను శక్తిలేదు.

ఈనూతన సంగతులను విని యాశ్చర్యపడి పథికు డిట్లు విన్నవించెను:—

స్వామీ! నాజీవితములోనిదియే సుదినము. తమ వంటి మహానుభావుల సాంగత్యమందు సదా నివసించు పుణ్యము లేనందుకై నేను చాల విచారపడుచున్నాను.

నిరాశను సూచించు పథికుని వాక్కులచే ననుకంపన మొంది మహాపురుషుడు ప్రసన్నవదనుడై యిట్లు పలికెను.

ఇచ్చటనుండి త్వరగా వెళ్లి పొమ్మనిచెప్పుదు రేమో యనుభీతిని వదలుము. ఈయాశ్రమమున మాయాచర ణను జూచుట కవసరమైన కాలవ్యవధానమును దప్పక నీకిచ్చెదము. కాని, యిచ్చటనే నీవు నివసించుటకు వీలు లేదు. ఏలయన, నీవు చేయవలసినపను లింకను కొన్ని గలవు. నీదేహములయందు పశుస్వభావమునకు సంబం ధించిన హీనభూతము లింకను యున్నవి. కాన పరిశుద్ధ మైన యీస్థలముయొక్క యుత్తమ తేజస్సును నీవు భరింపజాలవు. ఏమైనను సరే యని బలాత్కారము గా నీవిచ్చటనుండ యత్నించిన నీదేహము క్షయ రోగి శరీరమువలె శుష్కించి బలహీనమగును. దానిచే

నీకు దుఃఖము తటస్థించునేకాని సుఖము ప్రాప్తించదు. ఒకవేళ నీవు మరణమొందెదవేమో !

పథికుడు.— వస్తువుల రూపములను మార్చుటకును, హీనలోహములను స్వర్ణముగా జేయుటకును తమ సంఘమువారికి శక్తి గలదని నేను వినియున్నాను. ఈరహస్యమును తెలిసికొనగలుగు నంతకాలము నాకు దొరకునా ?

మహాపురుషుడు.—నీవడిగిన విషయ మంత రహస్యము కాదు. అనుదినము సృష్టిలో నడచుచున్న ప్రకృతి సంబంధమైన కార్యములలో నెంత రహస్యమున్నదో మేము ప్రయోగించు శక్తి విశేషములోగూడ నంతే రహస్యమున్నది. సత్యమును గ్రహింపజాలని చార్వాకులు, తత్వవిద్వేషులగు దేహాత్మభావులు తప్ప మరి యెవరును మాకార్యములకు నిరాధారమైన యద్భుత శక్తి నారోపించరు. తన యిచ్ఛానుసారముగా ప్రకృతిని నియమనముజేయు సామర్థ్య మాత్మకున్న దని యెవరెరిగియున్నారో వారలకు స్వభావనియత కార్యములయం దద్భుతము లేమియు గనపడుట

లేదు. చంద్రుడు భూప్రదక్షిణము జేయుటయందును, సస్యాదులు వృద్ధి యగుటయందును నెంత యాశ్చర్యమున్నదో మాశక్తిప్రయోగముచే జరుగు కార్యములయందు నంతేయున్నది. మిత్రుడా! మేము ప్రయోగించు శక్త్యాదిశక్తియైన యిచ్ఛాశక్తి యొక్క మహిమావిశేషములేగాని వేరుకాదు. జగమంతయు నాయిచ్ఛాశక్తివలన బుట్టియున్నది. పరాశక్తిగను, అపరాశక్తిగను ప్రకాశించుచుండునదా యిచ్ఛాశక్తియే! ఎన్నిరూపములుగ బ్రకాశించిన నది యీశ్వరునిశక్తియైయుండుట నిశ్చయమే. ఆయిచ్ఛాశక్తి మానవశరీర మందును పనిచేయుచున్నది. తన కిష్టమువచ్చినట్లు దాని నుపయోగించు సామర్థ్యము ప్రాజ్ఞునకున్నది.

పథికుడు—ఇచ్ఛాశక్తియే యన్నిటికి నాధారమైయున్న యెడల దానిని వృద్ధిచేసికొనిన చాలదా?

మహాపురుషుడు—అట్లుకాదు. ఇచ్ఛాశక్తి విశ్వవ్యాపియై సమస్తలోకములను భరించుచున్నది. గ్రహముల గమనాగమనములకు నదియే యాధారశక్తియై

యున్నవి. సృష్టిలో దానినొక స్వభావనియమముగా (Law) భావించవచ్చును. అదివ్యాపించని వస్తువే లేదు. సర్వమునుజేయు సామర్థ్యము దానికున్నది. మానవుడు దానిని వృద్ధిజేసెదననుట పిచ్చితనము. దానిని కనుగొని యనుగుణముగా వర్తించిన నది మానవునియందభివ్యక్తమై పనిచేయ నారంభించును.

పథికుడు—తనకిచ్చవచ్చినట్లు యిచ్ఛాశక్తి నుపయోగ పరచుకొను సామర్థ్యము మానవునకు లేనియెడల వాడు దానికై యేల పాటుపడవలెను?

మహాపురుషుడు—నరులు తమతమ యిచ్ఛను వేరువేరుగ నుపయోగించ యత్నించిన ఫలములేదు. విశ్వవ్యాపకమై, ప్రాణప్రదమైయున్న "ఈశ్వరేచ్ఛను" సద్వినియోగము చేయుటకై తమయుక్తి వివేకములను మానవులు ప్రయోగముజేసిన నిజముగా నది ప్రయోజనకర మగుచున్నది. మానవుడు సహాయము జేయకున్న ప్రకృతివిధిచోదిత ఫలములను యథాప్రకారము సావకాశముగా గలుగజేయు చున్నది. కాని, మానవుడు సహాయముజేసిన నాఫలములు

త్వరగా సంప్రాప్తమగును. గుడ్డలనేయు యంత్రము నీటిసహాయముచే దిరుగుచుండ నదీజలమును దాని కొరకుపయోగించిన చాలునుగదా? నదీప్రవాహమును మూలమువైపు త్రిప్పవలసిన యవసరమేమి? యంత్రకారునకు ప్రకృతిధర్మము తెలిసియుండుటచేత నదీజలము సులభముగా తనయంత్రమునకు ప్రవహించునట్లు కాలువలనుజేసిన చాలును. ప్రకృతి ధర్మమునకు మనము లొంగిపనిచేసిన నాధర్మము మనయాధీన మగుచున్నది. తన్ననుసరించి వర్తించువారలకు ప్రకృతి యాధీనమగుట నిశ్చయము. కనుక, మానవు లవిచ్ఛిన్నముగానుండు యిచ్ఛాశక్తిని వివేకముగా నుపయోగించిన యెడల స్వభావధర్మమున కనుగుణములైన ఫలములు సిద్ధించుచున్నవి. మిత్రుడా! పర్వతాగ్రముక్రింద వ్రేలాడుచుండు మేఘము నదిగో చూడుము. వాయువుచేజలింపఁబడువరకు, లేక యుష్ణవ్యత్యాసముచే పైకిగాని క్రిందికిగాని వెళ్లువరకామేఘ మచ్చటనే యుండునుకదా! ప్రకృతిలోసహజముగానున్న శక్తులను ప్రయోగముజేసిన నామేఘమును చలింపజేయవచ్చును. అట్లుచేసిన మనము మనవివేకము నుపయోగించి నట్లగుచున్నదే కాని

ప్రకృతిధర్మమునకు విరుద్ధమైన కార్యమును జేసినట్లు కానేరదు.

ఈ విధముగ బోధించి యామహాపురుషుడు మేఘమున్న ప్రదేశముపై తనహస్తమును ప్రయోగించెను. తత్క్షణమే యామేఘమునకు చైతన్యము కలిగి అదిచుట్టుట కారంభించెను. చివరకామేఘము ధూమమువలె పర్వతాగ్రము నెక్కి వాయువుతో గలిసిపోయెను. అప్పుడా పర్వత మగ్నిమయ పర్వతమువలె గోచరించెను. మరల గొంతకాలమైన పిదప పర్వతాగ్రముపై తెల్లని చిన్న మేఘ మగుపడెను. దానిద్వారా సూర్యుడు ప్రకాశించెను.

నిర్జీవియగు నామేఘమునందంత స్పష్టముగా జైతన్యప్రదర్శనమైనందుకు పథికుడు చాలవిస్మయమొందెను. వాని మనోభావము నెరిగిన మహాపురుషుడు ''చైతన్యము విశ్వవ్యాపియై సర్వత్రయున్నది. ఇచ్ఛాశక్తియు నదియు నొకటే'' అని చెప్పెను.

ఇవ్విధమున ముచ్చటించుచు వారు మందిరమును సమీపించిరి. దాని బహిర్భాగమును పథికుడు చక్కగా

బరీక్షించెను. దానికి రెండంతస్థు లుండెను. ఎత్తైనగదు లుండెను. చతుష్కోణాకారము గలదిగా నుండెను. దానినలుప్రక్కల వివిధవృక్షములతో గూడిన యుద్యానవనముండెను. మందిర మధ్యభాగద్వారమునకు సప్తసోపానములుండెను. ద్వారముయొక్క యుభయపార్శ్వములలో నల్లని శిలాస్తంభము లెత్తుగా నిలిచియుండెను. ద్వారముపై స్వర్ణఖచితలిపి యివ్విధముగ నుండెను:—

"దీనిని బ్రవేశించువారు దుష్టసంకల్పములను విడువవలెను."

సప్తసోపానములనెక్కి మందిరద్వారమును బ్రవేశించిరి. రాళ్లుపరవబడిన ముఖమంటపమొకటి గోచరించెను. దాని మధ్యప్రదేశమున నొకపీఠముపై గౌతమబుద్ధుని విగ్రహముండెను. గోడలపై బ్రాచీనమహర్షులచే జెప్పబడిన తత్త్వార్థబోధక వాక్యములు స్వర్ణాక్షరములతో జెక్కబడియుండెను. ఆముఖ మంటపముయొక్క యుభయపార్శ్వములలోను వేరువేరు చిన్నమందిరములకుబోవు ద్వారములుండెను. ముఖమంటపముయొక్క ప్రధాన ద్వారమునకెదుట నుష్ణమండలమందువలె తరులతాదులచే సాంద్రముగానున్న శృంగారవనముయొక్క

ద్వారముండెను. ఉద్యానవనమున కావల శ్వేతశిలలచే నిర్మితమైన మరియొక మందిరముండెను. దాని కొక గోపురముండెను. సురంగమార్గమును బ్రవేశించగానే పథికునికి గోచరించినది యాగోపురమే. ఆ గోపురముపై స్వర్ణగోళమొకటి యుండెను. దానిపై రజితసర్ప ముండెను.

మహాపురుషుడు.—ఇదే మాయాశ్రమముయొక్క గర్భాగారము. దీనిని నీవు ప్రవేశించరాదు. అట్లు ప్రవేశించయత్నించిన నీదేహము మృతిజెందును. ఒకవేళ నదిజీవించినను ప్రయోజనములేదు. ఏలయన, నవిచ్ఛిన్నముగా నహర్నిశలయందు వెలుగుచున్న పారమార్థికజ్యోతిని తమహృదయాంతరంగమం దెవరు వెలిగించుకొనక ఈ మందిరమును బ్రవేశించ యత్నించెదరో వారి కీమందిరము చీకటిగదిగా నుండును.

ఒక పార్శ్వములోని ద్వారములగుండా వెళ్ళిరి. ఎడమవైపున వేరువేరుగదులకు బోవుతలుపు లుండెను. కుడివైపున పొడుగుగా గోడయుండెను. దానిలో ప్రక్కనున్న శృంగారవనమునకు బోవుతలుపు లచ్చటచ్చట

నుండెను. ఒక తలుపునుండి మఱియొక తలుపునకు మధ్యభాగమున గోడపై మనోహరమైన చిత్రములు వ్రాయబడియుండెను. అందొక చిత్రమునుజూడ హిమఖండ ములతోగూడిన హిమాలయపర్వతము వ్రాయబడియుండెను. దానికెదుట కొంతదూరమునందరణ్యమయ శైలములతో నిండిన చీనాదేశపు దేవాలయ మొకటి వ్రాయబడియుండెను.

మహాపురుషుడు—ఈచిత్ర పటములలో మాపథమునకు జేరిన వారియాశ్రమములు సూచింపబడియున్నవి. నీకెదుటనుండు చిత్రపటము టిబెట్ మధ్యభాగమున నొక తటాకముయొక్క సమీపమందున్న ప్రదేశమును జూపించుచున్నది. మాపథమునకు జేరినపెద్ద లాయాశ్రమమందున్నారు. ఆశ్రమ స్థలమును నిర్దేశించుటయే గాక ప్రతిచిత్రపట మేకాగ్రదృష్టిగా జూచువారల కచ్చటి రహస్యమును వెల్లడి జేయుచున్నది.

ఈమాటలనువినిన పథికునకా యాశ్రమ రహస్యములను జూడ కుతూహలము కలిగెను. లామాలయమును

నిర్దేశించు పటము నేకాగ్రముగ జూడ నారంభించెను. కొంతకాలము కాగానే యాయాలయము యొక్క తలుపులు తెరువబడెను. దీర్ఘకాయుడగు మహాపురుషు డొకడు బయటకువచ్చెను. శుభ్రమైన తెల్లని యుడుపులను ధరించి యుండెను. తలపై పట్టుపాగయుండెను. పథికునికి జాగ్రత్స్వప్నకాలములో గోచరించియున్న మహాత్ములలో నతడొకడై యుండెను. కాన నతనికా పథికుడు దీర్ఘప్రణామము గావించెను. వానిని గుర్తించిన ట్లామహాత్ముడు సంకేతము జేయుచు బ్రసన్నవదనుడై తలయూడించెను. అంతలో నతి సుందరమగు నొక యశ్వశ్రేష్ఠమును దూతకొనివచ్చెను. మహాత్ముడా గుఱ్ఱము నెక్కి వెళ్లిపోయెను.

పథికుడు విస్మయమొంది యేమియు దోచక యూరకుండెను. శాసనకర్తయైన మహాపురుషుడు చిరునవ్వు నవ్వి "మీ వేదాంతుల కగోచరములైన రహస్యము లెన్నియో యీలోకమందును పరలోకముల యందు నున్నవి" అనిచెప్పి పథికుని బిలిచికొని వెళ్లెను.

మరియొక చిత్రపటముపై పథికునిదృష్టి పారెను. దానికెదుట గొంతదూరములో నొక మఠము పిరమిడ్డులని పిలువబడు గోరీలు గోచరమయ్యెను.

ఈజిప్టు దేశములోని మహనీయులు నివసించు చున్న యాలయములుగా దోచెను. నలువైపుల నిసుక యెడారి యుండినందున నాప్రాంత్యమంత ప్రకాశమాన ముగా నుండలేదు. మూడవపటమును జూచెను. దానిలో నుష్ణ దేశీయ పర్వతప్రాంతము గోచరించెను. ఆప్రాంతమం దొక మందిర మగుపడెను. దక్షిణ అమెరికాకుచేరిన "కార్డిల్లీరాదీ" వద్ద యుండినట్లు తోచెను. నాలుగవ చిత్రపటమును జూడ మహమ్మదీయ కబరస్థానము గోచ రించెను. దానిపై గుమ్మటములు నర్ధచంద్ర రేఖయు నుం డెను. ఆసిద్ధాశ్రమ మందిరమందు పరమార్థ సంప్రదా యము లన్నియు నిర్దేశింప బడియుండుటను జూచి పథికు డాశ్చర్యము నొందెను.

పథికుడు—మహానుభావా! ఏమతస్థులైనను పరమ పావన మగు తమ సంఘమునకు జేరవచ్చునని తోచు చున్నది.

మహాపురుషుడు—లోకులు గ్రంథవ్యాసంగము ద్వారా గాని శ్రవణమువలనగాని కొన్ని యభిప్రాయములను ప్రమాణములుగా బరిగ్రహించి తృప్తులగుచున్నారు.

బుద్ధి కా (Intellect) యభిప్రాయములు సంబద్ధములు గా గోచరించినను (Intution) ప్రత్యక్ష జ్ఞానమునకు దూరస్థములై యుండవచ్చును. మాపథమున మూఢ నమ్మకమున కవకాశములేదు. లోకమతముల యం దైననో మూఢభక్తియే ప్రధానశిక్షగానున్నది. అందు వలన మతములలో గావలసినంత కశ్మలమున్నది. అను భవజ్ఞానమునకును కల్పిత జ్ఞానమునకును భేదములేదా? అనుభవజ్ఞానము మనయంతరంగమందే వికసించును. అది బయటనుండి గోచరించదు. బాహ్యజ్ఞానము స్మృతివిశేషమేతప్ప మరియేమియుకాదు. వస్తువుల స్మృతి మనకు యథేచ్ఛముగా నుండవచ్చును. అ యితే, వాని యాథార్థ్యమును చెప్పనలవికాదు. ఒకవేళ వస్తువులు సత్యములై యున్న నవి యను భవైక వేద్యములేగాని యూహాపోహాలకు జిక్కునవి కావు. ఉపదేశముచే వస్తుసాక్షాత్కారము కానే రదు కాని వస్తుసాక్షాత్కారమున కాయుపదేశము త్రోవను జూపుచున్నది. జ్ఞానమైననో వస్తుసాక్షా త్కారమే. సాక్షాత్కారము కాకమునుపొక వస్తు వును నమ్ముట మూఢభక్తి యనబడును. లోకమున ప్రసిద్ధిగానుండు భౌతికశాస్త్రము, తత్వశాస్త్రము,

ఈశ్వరవిద్య మొదలగునవి పూర్వపక్ష సిద్ధాంతముల నెడు వాదయుక్తులచే నిర్ణయింపబడియున్నవి. యుక్తులచే నిర్ణయింపబడిన శాస్త్రములు కృతకములు కాన వానిని విశ్వసించుట మూఢనమ్మకమే. ఇదిగాక నరునకు బుద్ధిహెచ్చినకొలది క్రొత్తక్రొత్త యుక్తులు తోచవచ్చును. కాన వానిచే పాతసిద్ధాంతములకు కుందకము కలుగును. వానిచే నుపపాదించబడు సత్యమే లోపమగుచున్నది. అందువలన, "నైషా తర్కేణ మతిరాపనేయ" తర్కముచేత నీబుద్ధి లభించనేరదని యుపనిషత్తు ఘోషించు చున్నది. ఆత్మ దృష్టిచే జూచుచు నాత్మజ్ఞానముచే గ్రహించిన నిజమైన జ్ఞానము స్ఫురించుచున్నది.

ఈ కారణముచేతనే, మాసంఘమందు వాద వివాదముల కవకాశములేదు; మూఢనమ్మకమునకు స్థానము లేదు; స్వాభిప్రాయములయందు మమత లేదు. సత్యమును సాక్షాత్కరించుకొనుటకై మేము యత్నించుచున్నాము. గ్రంథముల వలనగాని, పరిశోధనల వలనగాని, మరియే బాహ్యోపపత్తుల వలనగాని మాకెట్టి యవసరము లేదు. అట్లుండినను, మేము గ్రంథాలయములను నెలకొ

ల్పి విచారపరుల యభిప్రాయములను దెలిసికొనుచున్నా
ము. కాని వానిని ప్రమాణములుగా నంగీకరించము.
మామా యుక్త్యనుభవములకు సమ్మతము కానియెడల
సాక్షాత్తుగా బుద్ధదేవునిచే సెలవీయబడిన వాక్యములనై
నను మేము ప్రమాణములనిగ్రహించము. వానిని మేము
తప్పక గౌరవించెదము. సమయము వచ్చినపుడు వాని
నుపయోగముకూడ చేసెదము. వేయేల, వానిని
మాసేవార్థ ముపయోగపరిచెదమే కాని వానికి మేము
కింకరులము కాజాలము.

ఈ సంభాషణలో వారిరువురు పుస్తకాలయమున
కేతెంచిరి. బల్లలపై వరుసగా పుస్తకము లుంచబడియుం
డెను. లోకములో దగ్ధమైపోయి యుండిన పుస్తకముల
పేర్లను పథికుడు తెలిసికొనియుండెను. అవి యన్నియు
నాయాలయమందుండెను. అచ్చటికేలాగున వచ్చియుండ
వచ్చునని పథికు డాలోచనచేయ నాభావమును గను
గొని మహాపురుషు డిట్లుచెప్పెను.

మహాపురుషుడు.—నీ సంశయము తెలిసెను. లోకమందు
తటస్థ మగునదంతయు సూక్ష్మమగు దివ్యతేజమం

దం (Astral Light) కీత మగుచున్నదని నీవు వినియుండ లేదా? ప్రకృతికి స్మృతిభండారముగా నున్న యా దివ్యతేజమునుండి, కావలసిన విషయమును పరిగ్రహించి యితరులకు గోచరమగునట్లు చేయవచ్చును. మా యాశ్రమములో నొంద రీ కార్యమునే జేయుచున్నారు. వారి యుద్యమముచేతనే యీగ్రంథములు మాకు లభించియున్నవి. ఇన్ని గ్రంథములను సేకరించవలెనన్న నెంతద్రవ్యము కావలసివచ్చునో యాలోచింపుము. మాకు ద్రవ్యవ్యయములేకనే యిప్పుడు లభించియున్నవి."

తన యభిప్రాయమున కీమాటలు సమంజస మైనందున పథికు డానందభరితు డాయెను. ఏలయన, నా యాశ్రమ ప్రవేశమునకు మునుపొక నిర్ఝరమువద్ద కూర్చుండి ప్రకృతియొక్క నిశ్శబ్దస్థితి ననుభవించుచుండగా "నిర్జన ప్రదేశవాసము నిరర్థకముకాదు, మానవుని మనస్సునుండి బయలువెడలు యాలోచనలు సత్యమైనవి, జనసంసర్గమందుండుటకన్న నిర్జనప్రదేశమందుండి వానినితలచిన నవి పొందురూపములను జక్కగా జూడవచ్చును, గ్రహించవచ్చును" అనెడు భావనా పరంపర స్ఫురించియుండె

ను. అవియన్నియు నిపుడు నిదర్శనమునకు వచ్చెనని వాడు సంతోషించెను.

మహాపురుషుడు.—నీవు భావించినవిధముగా భావించిన తత్వవేత్తలచే నీ యాశ్రమము నిర్మింపబడియున్నది. నీకుదోచిన కారణమునుబట్టియే యీ నిర్జనప్రదేశ మును వారేర్పరిచిరి. నీవు గ్రహించనలవికాని కొన్ని స్వభావశక్తుల నుపయోగపరచి యీ యాశ్రమము చుట్టును మాయను కల్పించియుండుటచేత నత్యా చారుల కీ యాశ్రమము దుర్గమముగానున్నది. సర్వ హృదయములయం దంతర్గతమగు నాత్మబీజమును నెవరు తమయం దంకురము జేసికొనియున్నారో వా రల పురోభివృద్ధికి సాధకములైన సందర్భము లిచ్చుట దొరకుచున్నవి. బాహ్య ప్రపంచమునుండి వేరుపరచ బడి యజేయముగానున్న యీ ప్రదేశమున మేము శాంతచిత్తులమై వసియించుచున్నాము. ఒకవేళ నీమా యాశ్రమము కనిపెట్టబడినను అత్యాచారులు దీనిం బ్రవేశించక యుండులాగున మేము వివిధమాయలను గల్పించగలము. స్థూలదేహముతో మేము బాహ్య

ప్రపంచమందు సంచరించకున్నను బాహ్యప్రపంచ సంబంధము మాకు లేకపోలేదు. దివ్యదృష్టి, దివ్యశ్ర వణములచే లోకమందు తటస్థమగుదానిని మేము గ్ర హించగలము. ఒకవేళ లోకములో సంచరించదలచిన మాస్థూలదేహముల నిచ్చటనేయుంచి సూక్ష్మశరీర ములతో పోయిరాగలము. ఎవరిని చూడదలచినను చూచిరాగలము. దేనిని చూడదలచిన నితరులకు గోచరించకనే చూచిరాగలము. మేమప్పుడప్పుడు రాజ్యతంత్రజ్ఞులను, మంత్రాలోచన సభికులను, తత్వశాస్త్రజ్ఞులను, ప్రకృతిశాస్త్రవేత్తలను చూచి వచ్చుట కలదు. వారివద్దకు వెళ్లినపుడు ప్రయో జనకరములైన యోచనలను వారి మనస్సుల కంకితముజేసి వచ్చెదము. తమ కాయోచన లెచ్చ ట నుండి వచ్చినవో వారు గ్రహింపజాలరు. వారి కొకవేళ తమ స్వంతయోచనలయందే యెక్కువ మమ కారముండిన మే మంకితముచేసిన యోచనలు వారి మనస్సులలో దూరవు. వారు వివేక శాలురై, యుక్తి పరులైయుండిన మేము మానముగానిచ్చు యోచనలను బరిగ్రహించి ప్రయోజనమును పొం దెదరు.

పథికుడు:—— అట్లైన, భూలోక రాజకీయ విషయము లలో మీ రెన్ని విధములుగానో పనిచేయవచ్చునని తోచుచున్నది. పూర్వమునం దసంగతములగు రాజకీయవిషయము లనేకములు నడచినవి కదా! వానిని మీ రెందుకు సరిపుచ్చలేదు?

మహాపురుషుడు:——మిత్రుడా! నిష్పక్షపాతమైన ఈశ్వరుని న్యాయవిధి యొక్కటి లోకమందు పనిచేయుచున్నదని నీ వెరుగవా? ఆవిధి చొప్పున కొందరికహితము తటస్థించుట యవసరమే. ఆచెడుపు కలుగకున్న మనుష్యుడు బాగుపడడు. ఈశ్వరుని న్యాయవిధి వైద్యుని శస్త్రమువలె పనిచేయుచున్నది. ఒక జనాంగము వారియారోగ్యముచెడిన వారి యనారోగ్యమునకు కారణభూతమైన భాగమును కోసి వేయకున్న కళ్మల మెట్లు పరిశుద్ధికాగలదు. దుఃఖములన్నియు ప్రచ్ఛన్నము లైన యీశ్వరానుగ్రహములని తెలిసికొనుము. దుర్మార్గ దౌర్జన్యములుగల వారిమూలముగా కూడ నీశ్వరుడు లోకహితమును గావించుచు దనయాజ్ఞనుపరిపాలించుకొనుచున్నాడు.

పథికుడు.—తెలివితేటలు లేక వర్తించు కొందరి విషయమందైనను ప్రవేశించి వారికి దుఃఖములు రాకుండ మీరేల కాపాడరాదు?

మహాపురుషుడు.—వారికి తెలియకనే మా యిష్టానుసారము వర్తించులాగున మనుష్యులను మేము స్వాధీన పరుచుకొనవచ్చునుగాని అది మాసంప్రదాయమునకును, ఈశ్వరవిధికిని విరుద్ధముగా నున్నది. ప్రతి మనుష్యుడు తనకర్మను తానే నిరూపించుకొనుటకు స్వతంత్రుఁడై యుండవలెనని ఈశ్వరుని విధి నియమించి యున్నది. అవసరమున్నయెడల మాయాశ్రితులకు మేము హితమును జెప్పవచ్చునే కాని వారి మనస్స్వాతంత్ర్యమునకు మేము కొదవను కలుగజేయరాదు.

పథికుడు.—నిరపరాధు లనేకులు తాము చేయని కర్మములకుగాను దుఃఖము ననుభవించవలసి వచ్చుచున్నది. సత్యమునకై యనేక యిడుములకు జిక్కి తమ దేహములనే బలియివ్వవలసి వచ్చుచున్నది. అట్టివారిని మీరేల రక్షింపరాదు?

మహాపురుషుఁడు.—అట్టివారికితగిన బహుమానము లేక పోలేదు. లోకహితార్థము బలియైనవానిరక్తమునుండి యమితఫలము లభించుచున్నది. వారికి లభించు సుఖముకంటెదట్టమగుదుఃఖమతిశయముకానేరదు. మానవు లల్పదృష్టిగలవారై యుండుటచేత వస్తుమూల్యమును జక్కఁగా నెరుగజాలరు. లోకమందెద్దియు నిరర్థకము కానేరదని తెలియుము. యోగ్యులను రక్షించు విధానమును నీవెరిగిన చాలయాశ్చర్యపడుదువు.

ఏలాగైన నాసాధువుల సంఘమును జేరవలెనని పథికుడు దృఢముగాదలచుచుండెను కాని యాభావమును వెల్లడిజేయ జడిసెను. దానిం గనుగొని మహాపురుషుడు మరల చెప్పసాగెను.

మహాపురుషుడు—. అధికారముసంపాదించినవారిని మా సంఘములో జేర్చుకొనుటకేమి యభ్యంతరముండదుకాని యట్టియధికారసంపత్తిగలవా రరుదు. పక్షపాతముతో నెవరిని మాసంఘములో జేర్చుకొనము. స్వప్రయత్నముచే మనుష్యుడు మహాత్మస్థితిని సంపాదించవలసినదే కాని మే మెవరిని మహాత్ములుగా జేయము.

పథికుడు.—పరమార్థమందు వృద్ధియై మహాత్మస్థితికి వెళ్ల దలచినవారు తమవలె నిర్జనప్రదేశములలో నివసించుచు ధ్యానధారణనిష్ఠలయందుండుటమంచిదికాదా? ప్రసక్తకాలమునబరమార్థాభివృద్ధికనుకూలములైనసందర్భము లేలోకమందుదొరకవని అన్ని మతముల ముముక్షువులు చెప్పుచున్నారు. అత్యల్పమగుజీవితకాలమును స్వగౌరవస్థాపనకొరకును, స్వార్థముకొరకును, ధనకనకాదులకొరకును, వనితాదిభోగములకొరకును పాడుచేయుటకన్న నెక్కువపిచ్చితనము మరియేమున్నది? బహుజనులు వీనికొరకే పాటుపడుచున్నారు. విచారపరులైనచో, నివియన్నియు నశ్వరములనియు, నరజన్మము నిత్యమగుయాత్మ యాత్రకు సంబంధించిన యొక స్థితిమాత్రమే యనియు, మానవునియందు బీజప్రాయముగానున్న యాత్మ వస్తువు ప్రకాశమగుటకై కావలసిన సందర్భములను నరజన్మ మిచ్చుచున్నదనియు, యత్నముచేసిన మనుష్యు డుత్తమస్థితినిబొంది జన్మరాహిత్యమును సంపాదించవచ్చుననియు, తెలిసికొనుచున్నారు.

పథికు డీమాటల నత్యుల్లాసముతో ముచ్చటించుటనువిని మహాపురుషుడుచిరునవ్వుతో మరలచెప్పసాగెను.

మహాపురుషుఁడు.—జను లేకాంతవాసమునకు సిద్ధముగా నుండిన నటులనే చేయవచ్చును. కాని వారికి నిజమైన జ్ఞానముండవలెను. మూఢనమ్మకము చేతను, పరాభిప్రాయములచేతను భ్రాంతులైయున్న వారొకచోట జేరిన; వారికి భిన్నాభిప్రాయములు, భిన్నరుచులు నంతకంత కెక్కువై యేక హృదయము గలవారు కాజాలరు.

ఏలాగైన నట్టి యేకాంతనిలయముల నచ్చటచ్చట నేర్పరచి వానిలో నివసించు జనులు పరమార్థాభ్యాసమును జేయుచుండిన మంచిది. నిరర్థకములైన శాస్త్రమార్గములయందును, మూఢనమ్మకములయందును బ్రవేశించక సదా తత్వార్థ విచారమందె నిమగ్నులైయున్నవారు కొందర చ్చటచ్చట శిష్యా నిలయములను గల్పించుకొనియుండిన చాల ప్రయోజన మగుచున్నది. దీనివలన వారి యుత్క్రాంతియు సులభముగా జరుగుచున్నది.

ఆధునిక నవనాగరీకతలో జనులకు రెండువిధముల విద్యాభివృద్ధి యగుచున్నది. అవి యేవి యనిన.—

(1) భౌతికశాస్త్రవిధాన మొకటి (2) మతశిక్షణవిధాన మొకటి. మొదటి విధానమున బరిశోధనలచే విషయములు వెల్లడి యగుచున్నవి కాన నవి యుక్తియుక్తములుగను, సుసంబద్ధములుగను బోధింపబడుచున్నవి. ఇది శ్లాఘ్యమైన విధానమేకాని యీ శాస్త్రజ్ఞులుచేయు పరిశోధనల యందు వారికామస్వభావము చేరి యుండుటయేగాక బాహ్యోపపత్తులు కూడ సంకుచితములై యుండును. అందువలన నవి భ్రాంతి సిద్ధములైనవిగా నుండునేకాని సత్యబోధకములుగా నుండవు. బాహ్యసాధనముల ద్వారా పరిశోధించుటకన్న నాంతరంగిక జ్ఞానముచే గ్రహింప యత్నించిన ఫలము కలదు.

పథికు డీమాటలను బాగుగా నర్థముచేసికొనలేదు. కావున మహాపురుషుడు మరల చెప్పసాగెను.

మిత్రుండా! వేరువిధముగా నర్థము చేసికొనవలదు. భౌతికశాస్త్రజ్ఞులకు ప్రకృతి ధర్మముల జ్ఞానములేదని నా యభిప్రాయముకాదు. బాహ్యమందు తమకు గోచరించు దానిని వారు చక్కగా దెలిసికొని సమంజసముగా బోధించగలరు. అయితే, బాహ్యమందు గోచరించునవి

ఫలరూపములైన కార్యములేకాని కారణములు కావు. ఆకారణములు సూక్ష్మలోకములయం దుండును. భౌతిక శాస్త్రముయొక్క పరిశోధనలైననో భూలోకమున దప్ప తక్కిన యూర్ధ్వలోకముల వరకు పోజాలవు. అందుచే నా శాస్త్రమునకు కార్యములను శోధించు శక్తి మాత్ర మున్నదే కాని కారణములను గనుగొను సామర్థ్యము లేదు. లోకము పరిణమించిన విధానమును భౌతికులు చెప్పగలరే కాని దానికి కారణమైన యఖండవస్తువు యొక్క పనిని గనుగొనజాలరు. వేయిమాటలేల, క్షణ భంగురములైన కార్యములన్నియు దేనివలన సంభవించు చున్నవో యాచైతన్య వృక్షమును భౌతికులు తెలియ జాలరు.

మతబోధకగ్రంథములైననో పరమార్థ సూచక పదములను దప్పుగా నర్థము చేసికొని బోధించుచు న్నవి. కారణమేమన, మతబోధకులు తత్వవేత్తలు కారు. వారి తెలివి సంకోచముగా నుండుటచేత విశాలముగా నున్న స్వభావ శక్తులను గ్నప్తములగు వ్యక్తులుగా భావిం చెదరు. సర్వవ్యాపియై యఖండముగానున్న యీశ్వర తత్వమును జగత్తు కన్యముగానుండు ఖండమూర్తిగా

దలచెదరు. తన యిష్టానుసారము తనయాజ్ఞను వ్యత్యాస పరుచుచు దనకిష్టము వచ్చినవారిని తనప్రతినిధులుగ నీ లోకమం దేర్పరుచుకొనుచు నిరంకుశ ప్రభువై స్వామి వర్తించుచున్నాడని తలచి యావిధముగనే యజ్ఞులగు పామరులకు బోధించెదరు. దేవుడు పూర్వకాలమున నెప్పుడో జీవించియుండి మృతుడైనట్టును, ఇప్పు డెద్దియో నొక లోకమం దున్నట్టును దెలిసికొని యున్నారు. ఇట్టి మత బోధనలచే జీవు డేలాగున యభివృద్ధి యగుచున్నాడో నీవే యాలోచింపుము.

మతములు సత్యబోధకములుగా నుండపనిలేదా? పరతత్వమును దెలిసి యుపదేశించు మతగురువులే యరుదు. ఎంత తెలివిగలవాఁడైనను క్లప్తమైన తనమత సిద్ధాంతమునే బోధించునుకాని సత్యము నుపదేశింపడు. ఒకవేళ సత్యమును బోధింపదలచినను వానికాశక్తి లేదు. ఆత్మ సాక్షాత్కారము లేకనే తత్వార్థమును బోధించ నోపునా? మత గురువులు తమమత సిద్ధాంతములను వదలి సత్యమునే యథాస్థితిగా బోధించ యత్నించిన, వారిని దైవదూషకు లని యెంచి అజ్ఞులు బహిష్కరించెదరు. ఇది యుక్త్యుపాసనా కాలమేగాని సత్యమును

గ్రహించు కాలముకాదు. ప్రతివాని హృదయమందు నపరోక్షానుభూతి లేకపోలేదు. అయితే దానిని ప్రకాశ పరుచుకొని సత్యమును గ్రహించ వలెనని యెవరు య త్నముచేయరు. ఆధునికులు దుర్భిణి నుంచుకొని వస్తువు లను జూచువారై యున్నారని చెప్పవచ్చును. దుర్భి ణితో వస్తుదర్శన మగుట నిశ్చయమే కాని వస్తు సాక్షా త్కారము కాజాలదు. వస్తు సాక్షాత్కారమే యపరో క్షానుభూతి. మతానుయాయుల కీయభిప్రాయ మింకను తోచలేదు కాన జీవజగత్తుల విషయమై వారికి సరియైన తెలివి తేటలు లేవని చెప్పవచ్చును.

ద్వితీయాధ్యాయము సంపూర్ణము.

# సిద్ధాశ్రమము.

## తృతీయాధ్యాయము.



### అనిరీక్షితానుభవములు.

పథికుని మనస్సు దీర్ఘ విచారమందు విలీనమై యుండెను:—"ప్రకృతియనగానేమి? మానవుడననేమి? నే నీప్రపంచమందెందు నిమిత్తమున్నాను? ఇంతకు మును పు నేనుంటినా? ఎచ్చటనుంటిని? ఏలాగున వచ్చినాను? ఏకారణముచే వచ్చినాను? నాపరిణామ మేమి?" మొద లగు నవియన్నియు గహనవిషయములై యుండుటచేత వాని మనస్సునకెట్టి యుత్తరము స్ఫురించలేదు. దానిని గుర్తెరిగి మహాపురుషుడు చెప్పసాగెను.

మహాపురుషుడు.—నేత్రములకు గోచరించు మానవుడు మరణభాజకుడని తలచుము. వానిని జ్ఞానముతో గూడిన పశువని చెప్పవచ్చును. వాడు భ్రాంతిసిద్ధ ములై యున్న బాహ్యవస్తువులను సత్యములని నమ్మి

వానిమధ్య పురుషుడై జీవించుచున్నాడు. నిజమైన మానవు డాత్మయే. కాని దేహముకాదు. వా డీశ్వరాంశ సంభూతుడు. అయితే వాడు కొంతకాలము దేహము నాశ్రయించుకొని యుండును. "మానవ బీజము పాపక్షేత్రమందు విత్తబడి దానియందే యుద్ధరింపబడుచున్నది." పార్థివదేహ మట్టిక్షేత్రముగా నున్నది. దానిలో నాత్మ బీజము పెరుగుచున్నది. వస్తుస్వరూపముచే నది పారమార్థిక బీజముకాన తాను నివసించు ప్రతి దేహమునకును స్వామియై యుద్ధారకర్త యైయున్నది. మనుష్యుడు దృశ్యమగు తన స్వభావములోని వ్యాపారముల నెందాక తెలియజాలడో అందాక వాడు వానిని తన యాధీనము జేసికొనజాలడు. అట్టివాడు సస్యస్థితి యందున్నాడని చెప్పవచ్చును. తనకు గోచరించక గాలివానలచే తేబడిన, లేక, యాకస్మికముగా నాస్థలమందే దొరకుచున్న యాహారపదార్థమును బరిగ్రహించి సస్యము వృద్ధియగుచున్నది. తనవృద్ధిని నిరోధించుటకుగాని, వృద్ధిజేయుటకుగాని యాసస్యమునకు స్వాతంత్ర్యము లేదు.

ఆత్మయొక్క స్వభావము నెరిగి శరీరములలో తటస్థించు వ్యాపారములను గ్రహించునట్టి సామర్థ్యము మనుష్యున కెప్పుడు కలుగుచున్నదో అప్పుడు వాడు తన యుపాధుల వ్యాపారములను నియమనము చేయగలడు. అట్టి స్థితికి వచ్చినవాడు తనయుత్క్రాంతిని తనయాధీనమందే యుంచుకొని తనయందు సంభవించు మనోవ్యాపారములను బరిగ్రహించుటకును, తిరస్కరించుటకును స్వతంత్రుడై యుండును. అప్పుడు వాడు సస్యస్థితిని దాటి పశుస్థితికి వచ్చినవా డగుచున్నాడు. ఏలయన, దనకు లభించునాహారముచే దృప్తిచెంది యుండవలసినది సస్యమునకు విధిగానున్నది. తనకిష్టమైన యాహారమును పరిగ్రహించు స్వాతంత్ర్యము సస్యమునకు లేదు. పశువైననో తన యాహారమును వెదుకుచు వెళ్లి సంపాదించవచ్చును. తనకిష్టమైన దానిం దీసుకొని ఇష్టము లేనిదానిని విడుచు స్వాతంత్ర్యము పశువుకు కలదు. సస్యమున కట్టి స్వాతంత్ర్యములేదు. అజ్ఞులగు పామరులు (సస్యమువలె) తమకు సంప్రాప్తములగు విద్యమానములను బరిగ్రహించి తృప్తు లగుచున్నారు. ప్రాజ్ఞులైననో (పశువులవలె) తమకు కావలసిన విద్యమానములను గలుగ జేసికొనగలరు.

పథికుడు.—అట్లైన, మానవుని పరిణామోద్దేశము లేమి?

మహాపురుషుడు.—సర్వము తాననియు, దన్ను విడిచి యెద్దియు లేదనియు, మానవుని హృదయస్థమగు నంతరాత్మ తెలిసికొని పరమానందము ననుభవించుట యే మానవుని పరిణామము. నశ్వరమైన దేహభావముతో నున్న నరు డాత్మభావమును బొంది బ్రహ్మజ్ఞానముయొక్క పూర్ణప్రకాశమునకు సాధనమగుట యే వానియుద్దేశము.

ఈ వాక్యముల యర్థము పథికునికి బోధకాలేదు. "ఆత్మవస్తువు జగమువలె నతి విస్తారమైనదని తేటపడుచున్నది. నేత్రములకు గోచరించు పార్థివ దేహముగాక యాత్మకు వేరుయుపాధి యుండగలదా? యని శంకించెను.

ఈ సంశయమును గనుగొని మహాపురుషుడు పథికుని నొక కిటికీవద్దకు పిలుచుకొని పోయెను. ఆ కిటికీగుండా దుర్గమమైన శైలము కానవచ్చుచుండెను. పథికుని దృష్టి నటువైపున కాకర్షించి యతడుచెప్ప నారంభించెను.

మహాపురుషుడు.—మిత్రుడా! అజేయమైన మాయాశ్రమమును నీవు ప్రవేశించిన ద్వారము నదిగో చూడుము! నీవు వచ్చిన యాత్రోవనే యేకాగ్రముగా జూడుము. ఆశైలమున కావల పోవలెనని దృఢముగా భావించుము.

పథికు డా సాధుపురుషుని యాజ్ఞానుసారము చేసెను. ఒక నిమిషములో పర్వతమున కావల తాను మునుపు విశ్రాంతి కొరకు నిలిచియున్న స్థలమునకు వచ్చెను. వాని కెదుట మృతకళేబర మొకటి వెలికిలబడియుండెను. దాని నేకాగ్రదృష్టితో జూచెను. తన దేహమైయున్నట్టు తోచెను. భయభ్రాంతి గలవాడై ఇదియేమి స్వప్నమో లేక మాయయో యని కలవరించెను. తుదకు తాను చనిపోయి యుండవచ్చునని తెలిసికొనెను. ఆ దేహము తనకు బాహ్యముగా నుండినను తానుమాత్ర మెప్పటివలె సమస్తావయములతోను, ఉడుపులతోను యుండినట్టు తోచెను. శవముయొక్క టోపి నేత్రములపై పడియుండెను కాన వాడు దానిం దీసివేయ యత్నించెను. దుర్గమ పర్వతము నెత్తుటయు, నాటోపీ నెత్తుటయు సమమైయుండెను. వాని బాహువులకు పార్థివత్రాణ యుండలేదు.

తనకపుడు సిద్ధముగానున్న దేహము పార్థివదేహము కంటె భిన్నపదార్థముతో నిర్మింపబడియున్నట్లు తోచెను.

తానుమాత్రము మృతుడైయున్నానని యే భావించెను. హేయముగానున్న యామృతశరీరమందు తానెట్లు నివసించుచుంటినని యసహ్యాపడెను. దానినుండి నివృత్తుడైనందుకు పరమహర్షమును బొందెను. మరలదానిం బ్రవేశించుట కిష్టములేకయుండెను.

వానియంతర్వాణి మాత్రమాభావము ననుమోదించలేదు. నిశ్చైతన్యముగా నున్నట్టు గోచరించుచున్న వాని యాశరీరముగుండా వాడు భూమిపై చేయవలసినకార్యము లింకను కొన్నియుండెను. దానియాయుర్దాయమింకను ముగిసియుండలేదు. పథికుడుదానిని మరల బొందకతప్పదు. అనాథప్రేతమువలె భూమిపై పడియుండిన యాదేహమును జూడజూడవానికికనికరము పుట్టెను. అందుచే వాడాశరీరమున కాకర్షింపబడెను. ప్రజ్ఞకు విచ్ఛిత్తికలుగుచుండగామహాపురుషుని వాక్కులువినవచ్చెను. నిద్రనుండిమేల్కొనినవానివలె లేచెను. మహాపురుషుడు పార్శ్వమందే నిలిచియుండెను. స్వప్నమంతయు నదృశ్యమాయెను.

మహాపురుషుడు.—మిత్రుడా! స్థూలదేహము వేరు, కామ శరీరము వేరు అనుసంగతినీకిపుడు నిదర్శనమాయెనా? ఆత్మకు వేరు వేరు శరీరములుకలవు. వానిద్వారా వాడు తనశక్తులను వ్యక్తము జేయుచున్నాడు.

పథికుడు.—ఈసంగతు లన్నియు శాస్త్రజ్ఞుల కేల తెలియవు ?

మహాపురుషుడు.—దురభిమానముండుటచేత ! ఈసంగతు లనవసరములని మొన్న మొన్నటివరకు శాస్త్రజ్ఞులు వానిజోలికే పోవుచుండలేదు. విశాలమగుప్రకృతి రాజ్యమందు తమకు తెలియనిసంగతు లున్నవని యొప్పుకొనుటకంటె చచ్చుటమే లని వారు భావింతురు.

మతబోధకులకునహిత మిట్టి పిచ్చిపట్టియుండెను. భౌతికుల సిద్ధాంతములవలె మతబోధకుల సిద్ధాంతములు దురభిమానముతో గూడియుండెను. మానవుడు స్వాతంత్రేచ్ఛగల పరిపూర్ణజీవు డనియు, నిటీవల వాడు దుర్మార్గమందు పడియుండుటచే శిక్ష ననుభవించు

కొరకు భూతలమునకు బందీగా పంపబడి యున్నాడని యు, నికమీద మంచినడత గలవాడైనను, లేక దుర్న డతలో నుండినను దేవుని క్షమాపణకు బాత్రుడై, పాప మునుండి విముక్తుడై పార్థివదేహము పడిపోయినపిదప దే వతాప్రసాదముచే నమరత్వమును బొంది స్వర్గమందు నిత్యసుఖియైయుండు ననియు వారు చెప్పుచున్నారు.

సత్యాన్వేషణ పరుల కిట్టి సిద్ధాంతము లెట్లు సమ్మత ములు కాగలవు? వీనిని ఋజువు చేయుటకుగాని తిరస్కరిం చుటకుగాని వీలులేదు. కాన సామాన్యజనులు వీనినేసరి యనిభావించెదరు. సామాన్యజనులుస్వాభావికముగా నా లోచనాపరులుకారు. తమనిమిత్తమిట్టివిషయముల నాలో చించుకొరకు మతబోధకులకు చేతనైనంత ద్రవ్యసహాయ మును వారుచేయుదురేగాని స్వంతముగా నాలోచింప బూనుకొనరు.

ఆంగ్లేయభాషయందు ప్రచురింపబడిన (Secret Doctrine) గుప్తసిద్ధాంతమనెడి గ్రంథము వెల్లడియైనది మొదలు భౌతికుల యొక్కయు మతబోధకులయొక్కయు విలక్షణ సిద్ధాంతములకు బాధకము కలిగెను. " మాన

వుడు పరిపూర్ణుడై పుట్టడుకాని పుట్టి పరిపూర్ణస్థితికి వచ్చు చున్నాడు. అందు నిమిత్తమే వానియనో దేహముల కప్పు డప్పుడు వ్యత్యాసము కలుగుచున్నది. జడములేక చైత న్యముండదు. చైతన్యములేక జడముండదు. ఇవి రెండును లేనిచో వ్యత్యాసమున కవకాశములేదు" అను నీ పురా తన తత్వబోధలు లోకమందు మరల నాగ్రంథము ద్వారా వెల్లడి చేయబడియున్నవి. భౌతికుల పరిశోధన లద్భుతవ్యక్తియైన మనుష్యుని దేహమును మాత్రమే కొంతవరకు విమర్శ చేసియున్నవి. కాని వాని నిజతత్వ మును విమర్శించలేదు. ఈయర్థము పై చెప్పిన గ్రంథ మందు స్పష్టముగా నిర్దేశింప బడియున్నది.

శాపానుగ్రహములచే జనులకు క్రమముగా దుఃఖ మును, సుఖమును గల్పించు సామర్థ్యము తమ కున్నదని యభిమాన పడుచుండు మతాధికారులకు "దేవుడు తన న్యాయ విధి కన్యముగాలేదు. మానవులు తమంతట తామే యుద్ధరించుకొనవలె ననుటయే యతని న్యాయ విధి, వానిలోనున్న హీనభూతములన్నియు నిర్నామములై పోయిన హృదయాంతరంగమందున్న స్వామి మానవు నకు సుప్రసన్నుడగుచున్నాడు. జీవించియుండఁగా సాధ్య

ముకాని యమరత్వము మృతి బొందిన పిదప సిద్ధించుట యసంభవముకాన బ్రతికియుండగానే మానవుడు దాని కొరకు నిర్ణయింపబడిన యధికారసంపత్తిని గలుగజేసి కొనవలయును. అధికారిగాకుండ నుత్కృష్టపదవికి బోవ నలవికాదు" అను మొదలగు తత్వార్థ వాక్యముల నుపదే శించి వారిదురభిమానమును పోగొట్టియున్నది.

మనుజుని ప్రధానస్వభావవిషయమందు ప్రాచీన మహర్షులు సుస్పష్టముగా బోధించియున్నారు. ఆయుప దేశ మప్పుడప్పుడు లోకములో వెల్లడి జేయబడుచు న్నది. పందొమ్మిదవ శతాబ్దమందు బ్లావట్‌స్కీ యో గిని సహిత మాబోధనే మరల వెల్లడి జేసినందున శాస్త్రజ్ఞుల గర్వమును, మతబోధకుల భ్రాంతియు భూగ తములాయెను. అయితే, యామె బోధించిన నూతన సిద్ధాంతములను వారింకను సంపూర్ణముగా బరిగ్రహిం చలేదు. వారట్లు పరిగ్రహించి జీర్ణము చేసికొన గలిగిన పుడు తమపూర్వ మాహాత్మ్యమును గురించి చాల పశ్చా త్తాపపడుదురు. "నరుడు జన్మించగానే దేవుడై యుండడు. ప్రాణికోటిలో వా డెంత యుత్తముడుగా గోచరించినను, పరమార్థమందు పసిబాలునివలె యుండును. భూలోక

మున నేవిధులు పనిచేయుచున్నవో యావిధులే యూర్ధ్వ లోకములలోను పనిచేయుచున్నవి. కాన నుపాధుల ప్రవర్ధమాన మేకరీతిగానున్న స్వాభావనియమములకు లోబడి నడచుచున్నదని చెప్పవచ్చును. అసత్తునుండి యేదియు పుట్టదు. పెరుగదు. దృశ్య పదార్థముకాని, అదృశ్య పదార్థముకాని సద్బీజములేక పరిణమించుట లేదు'' అను నీసిద్ధాంతములు మరల స్థాపింప బడి యున్నవి.

తగిన యుపపత్తులు లేక బీజముకాని, ప్రాణిగాని పరిణమించదు. ఆయుపపత్తులు బాహ్య కారణములవలన కలుగ వచ్చును. లేక బుద్ధికుశలతచే ప్రాణు లాయుపపత్తులను గల్పించి కొనవచ్చును. ఏలాగైన నాహారోత్తేజన రూపములుగానున్న యుపపత్తుల సహాయము లేక సస్యములుకాని, పశువులుకాని వృద్ధి కాజాలవు. అటులనే భావన లనెడుయాహారము, యుక్తు లనెడురసము పడకున్న బుద్ధి వికసించదు. హీన భూతములలో చైతన్యప్రదమగు పుష్టి ద్రవ్యమున్నది. ఆ ద్రవ్యములో దనకు కావలసిన దానిని వివేక మేర్పరచికొనవలెను. అట్లుగాకున్న నాత్మాభివృద్ధియగుట కష్టము.

ఈ వాక్కులను వినగానే పథికుని మనస్సులో నొక భావము స్ఫురించెను:—ఏ విధమైన ప్రతిబంధకములు లేక సుఖసామగ్రులే యధికముగానున్న యిట్టి యాశ్రమమందు నివసించుటచే నెంత సుఖము, ప్రయోజనము లభించవచ్చును! ఈభావము నెరిగి మహాపురుషుడు మరల జెప్పసాగెను.

మహాపురుషుడు:—శక్తియధికము కావలయునన్న దానికి విరుద్ధముగా పనిజేయు సామగ్రులు తప్పక యుండవలెను. ఆలంబుగిరిలో లేక శైలాద్రిలోనున్న వనపఙ్క్తులయందు నీవెప్పుడైనను సంచరించియున్నావా? అచ్చట కొన్నివనములలో వృక్షములు మిక్కిలి యున్నతములుగా బెరిగియున్నవి. వానిలో పైవరకు కొమ్మలుకాని యాకులు కాని కనబడవు. అగ్రభాగమున మాత్రమవి సాంద్రముగా గనబడుచుండును. దూరమునుండి చూచువారికవి పడవలపై నెత్తబడిన తెరచాపలవలె గోచరములగును. ఆ వృక్షములయందున్న చైతన్యరసము బహుదూరమువరకు పైకెక్కి కొమ్మలకు నాకులకు వ్యాపించవలసియున్నందున నధోభాగమున వేళ్లంత లోతుగా భూమిలోనికి

దిగవు. వర్షకాలమున బలమైన యొక తుపాను వచ్చిన శిరోభారముగల యీ వృక్షము లొకేతూరి నేలకు కూలుచున్నవి. మరికొన్ని చెట్లు భూమికి మూడడుగులలోఁగా కొమ్మను, ఆకులను విడుచుచున్నవి కాన వాటి వేళ్లు నేలలో బహుదూరము వెళ్లియుండును. గాలివాన యెంత బలముగా గొట్టినన వి పడిపోవు. భూమిలో రాళ్లు మొదలగు విరుద్ధవస్తువులను నిగ్రహించి వాని స్థానమందంతట తమ వేళ్లను బంపియుండుట వలన గదా యీవృక్షములకు పెద్ద తుపానునైనను తృణీకరించు సామర్థ్యము కలిగినది?

ఆధునికవిద్యార్థులా శిరోభార వృక్షములవలె నున్నారు. ఏలయన, వారు వ్యాసంగముచేయు విద్యానిలయములలో బహుకాలమునుండి యాచరణలో నున్న కొన్నిసంప్రదాయములను వా రతిక్రమించి నడువ వీలులేదు. వారిసహపాఠులందరాసంప్రదాయముల ననుసరించియే నడచుచున్నారు. విద్యార్థులంద రొకేవిధముగా నాలోచించుచు, నొకేవిధముగా నడువవలెను. అచ్చటి శిక్షావిధానము నతిక్రమించు స్వాతంత్ర్య మెవరికిని లేదు. ఆవిద్యాశాలలకు ప్రధానాభిప్రాయములు

కొన్ని నిర్ణయింపబడియుండును. విద్యార్థులు వాని నంగీకరించక తప్పదు. ప్రమాణముగా నిర్ణయింపబడిన యీ యభిప్రాయములను దిరస్కరించనలవికాదు. ఇట్టి క్లప్తములైన నియమములవలన ప్రతిబంధక సామగ్రులు లేకపోవును. ప్రతిబంధకములు లేకున్న శక్తి వృద్ధికాజాలదు కాన నావిద్యార్థులు హీనసత్వులై యప్రస్తుత సంగతులను తమబుర్రలోనించుకొనుచు శిరోభార వ్యక్తులై పరిణమించెదరు. ఆవిద్యాశాలలలో మేధాశక్తిని పుష్టిజేయుదురేగాని యాత్మవికాసమునకు మార్గములేదు. ఆత్మను పస్తుపెట్టుచున్నారని చెప్పినను దోషములేదు. ఇట్టివారు నూతనాభిప్రాయములనెడి చండమారుతముచే గొట్టబడగా దానిని భరించజాలక యొకేతూరి భూగతమగుచున్నారు. విద్యార్థులకు సదా క్రొత్త క్రొత్తయభిప్రాయముల నిచ్చుచుండవలెను. లేనిచో వారికి శక్తి యతిశయించదు.

మనోవృత్తులుసయితమీనియమమునకు లోబడియున్నవి. ప్రతిబంధకసామగ్రులను నిరోధించుటచేతనే యవి వికసించుచున్నవి. విరుద్ధశక్తులు లేకుండ జేసికొనుటలో నుపయోగములేదు. మనస్తరంగముల నక్కర

లేదనుటకంటె వానిని పరిగ్రహించి స్వాధీనమందుం చికొనుట మంచిది. ఏలాగైనను విరుద్ధ సామగ్రులను దగ్గరనేయుంచుకొని పలుమారు వానిని నిగ్రహముచేయు చుండిన మనశ్శక్తి అతిశయమగును. ఇతరులు తన్ను నిందించినను, ద్వేషించినను, పగఁబట్టినను, అసూయజూపినను మనుష్యుడు సహింప నభ్యసించవలెను. దుఃఖము ప్రాప్తించిన దానిని నిగ్రహించికొని జన్మమునకు దగిన మూల్యమును గట్టవలెను. విరుద్ధశక్తు లన్నియుజేరి తన హృదయములో ప్రచండ మారుతమును కలుగ జేసినను తాను మాత్రము చలించక యెవడు తన మనస్తరంగములను నిశ్చలము జేసికొనునో వాని హృదయమందుదయభాస్కరుని ప్రథమకిరణములు గోచరమై వివిధములగు నాలోచనల కాకరమైయున్న మానసచంద్రుడు కళాహీను డగుచున్నాడు. వానియంతర్దృష్టి కొక నూతనప్రపంచమే గోచరించు చున్నది. ఇంద్రియ కింకరులు పొందు సుఖముకంటె నుత్కృష్టమైన సుఖము వానికి లభించును. వా డనుమానప్రమాణముచే సత్యమును గ్రహించవలసిన యవసరముండదు. సత్యమును దానే ప్రత్యక్షముగా జూడగలడు. శాంతినిలయమున నిలిచియుండుటచేత వాడు గాలివానకు చిక్కడు. గాలివానకు

భయపడి శాంతినిలయమును జొచ్చియున్నాడని భావించకుము. ఏలయన, వాఁడేవిషయమందైనను నిర్భయముగలవాఁడై యుండును. గాలివానను నిగ్రహించు సామర్థ్యముకూడా వానికి వచ్చియుండును. తన నిగ్రహశక్తిని బాహ్యవృత్తియందు పాడుచేయుటకంటె తనయందు వికసించుట కుపక్రమమైయున్న యాత్మబీజమును త్వరగా వృద్ధిజేయుటకై వినియోగించుచున్నాడు.

జీవత్వమునకు గుణమే యాధారముకాన శిష్యావృత్తి నవలంబించ దలచినవాడు గుణమును జక్కపెట్టుకొన యత్నించవలెను. ఆగుణ మీశ్వరుని కరుణాప్రజ్ఞలకనుగుణమై యుండవలెను. గుణశక్తిలేనివాఁ డాత్మావలంబి కాజాలడు. అట్టివాడు తనదైవికస్వభావమున కన్యమైన మనస్తరంగముల యుద్వేగముచే బహుసులభముగ జలింపజేయబడుచున్నాడు.

మనస్తరంగము లుద్భవించినను నిశ్చలముగానుండు సామర్థ్యమువచ్చినపిదప బాహ్యప్రతిబంధకములు లేని యేకాంతస్థలమందు నివసించుట ప్రయోజనకరము. ఆవశ్యకముండువరకు ప్రపంచమందుండకముందు

గానే నిర్జన ప్రదేశమున కెవరు వెళ్లదలచెదరో వారు క్రమ సోపానములను విడిచి యొక్కటూరి స్వర్గమును జేర యత్నించినవారగుచున్నారు. ప్రపంచమం దుండ దగినవారు తప్పక యుండవలెను. వారికి విషయలోభ ముల వలన నెంత యధికముగా ప్రతిబంధకములు కలుగునో యంత యతిశయముగా వానిని నిగ్రహము చేయ వలసి వచ్చును. అందుచే వారికి శక్తి ప్రబలమగుచున్నది. ఎవరు తమ మనస్సును నిగ్రహించికొని యంతరాత్మకు కావలసిన యుపపత్తులను దానియందే కల్పించికొన గలరో వారికి బాహ్యోపపత్తులతో నవసరము లేదు కాన ప్రపంచమును వదలి యేకాంతవాసమునకు వెళ్లి స్వతంత్రులై యుందురు. తమ యాత్మవికాసమున కావశ్యకమైన ప్రపంచమును తమ యంతరంగమందే నిర్మించికొను శక్తి యెవరికి లేదో వారు బాహ్య ప్రపంచ మందుండుట యవసరము.

పరమార్థ సంస్కారములేని కొందరు ప్రపంచ కోలాహలమునకు భయపడి నిర్జన ప్రదేశమునకు వెళ్లుట కలదు. వారు సర్వత్యాగము చేసిన శూరులు కాజాలరు. జన్మ యుద్ధారంభమందే యుద్ధరంగమునుండి పారిపోయిన

రణభీరువు లనిపించికొనెదరు. రహస్యమును విచారించిన, వారు సుఖస్వర్గముల నాసించి ప్రపంచమును వదలి విర క్తిమఠములను జేరుదురేగాని వేరుకాదు. ఏప్రాణికిని చెడుపు చేయకయుండిన దేవునికి ప్రీతి యగుచున్నదని తలచి క్రియా శూన్యమైన నిరర్థక జన్మమును గడపెదరు. అంతటితో తృప్తిజెందక తాము నిరపరాధులై యున్నం దుకు తగిన ఫలమును నిరీక్షించెదరు. వారి యానిరీక్ష ణము మనోగత మగుటచేత మనస్సులోనే ఫలము కలు గుచున్నది. పరప్రయోజనములుకాని వారిజన్మములు నిర ర్థకములని చెప్పవలెనా? మరికొందరు తుచ్ఛ సుఖముల యందు కాలము గడపు విషయభోగివలె మతభ్రాంతిగల వారై నిరర్థకములైన కర్మలయందును, దేవతాప్రార్థనల యందును, కాలము గడపెదరు. విషయభోగి యైహిక భోగముల కొరకు యత్నము చేయులాగున మతభ్రాంతి గలవా రాముష్మిక సుఖములకొరకు కర్మ చేయుదురు. ఉభయులు స్వార్థపరులై యుండుటచేత వారియుద్దేశ నీ తులకు వ్యత్యాస మేమియు లేదు.

పరమార్థ సంస్కారమును పొందినవానిస్థితి యీ రీతిగనుండదు. ఉత్కృష్టమగు దివ్యస్థితిని సంపాదించిన

పారమార్థికుడు కాలదేశముల కతీతమైన నిత్యాత్మభావమందుండును. విరుద్ధముచేసి వానికి క్రోధమును గలిగించ నలవికాదు. తృణీకరించి రోషమును పుట్టించ సాధ్యముకాదు. కుతర్కముచే వాని మనస్స్వాస్థ్యమును పోగొట్ట నలవికాదు. స్వశక్తి మహిమ గోచరించినప్పటి నుండి వానిస్థూలదేహము చేయు ప్రోద్బలముచేగాని, యింద్రియములద్వారా వచ్చు బాహ్యస్పందముల ప్రేరణచేగాని వాడు చలించడు. ప్రోత్సాహశక్తికి తానే మూలకారణమై ప్రపంచమును సృష్టిచేయగలడు. కామశరీరము యొక్క హీనశక్తుల కధినాయకుడై వాని కోలాహలములవలన వృద్ధిక్షయములను బొందడు. నిత్యుడై, శుద్ధుడై, అవ్యయుడై, స్వతంత్రుడై పరిణమించును.

పథికుడు:—అట్లైన, సన్యాసత్యాగములు నిరర్థకములా ?

మహాపురుషుడు.—వానిని ప్రదర్శించు జనుల యుద్దేశమును కనుగొని నిర్ధారణ చేయవలసి వచ్చును. తానభివృద్ధియై గొప్పవాడనిపించికొనవలయు నని సన్యసించిన నిరర్థక మగుచున్నది. దీనిచే నితరులను మోసముచేయవచ్చును కాన నిది స్వాభిమానమునే వృద్ధి జేయును. దివ్యప్రజ్ఞాస్ఫూర్తి యగువరకు నీ కీ

యర్థము గోచరించదు. ఆప్రజ్ఞ వికసించినపిదప నిజమైన యాత్మ వేరు, మాయికమైన యాత్మవేరు అను భావము నీకు తేటపడును. ఎవరియందు దివ్యతత్వము ప్రకాశమై యున్నదో, యెవరికంతరంగజన్మమనుభవసిద్ధమై యున్నదో, ఎవరు పరాశ్రయమును వదలి తమ్మెదామె యాశ్రయించెదరో వారు బాహ్యప్రపంచముయొక్క విరుద్ధ శక్తుల పోరాటముచే గలుగు పాఠమును నేర్చుకొనుశక్తిని సంపాదించ నవసరములేదు. భ్రాంతిసిద్ధము లైన ప్రాపంచిక సుఖముల నపేక్షించి వారు వెనుకకు రారు. అట్టివారేకాంతవాసమునకు వెళ్లినను త్యాగముజేసినవారని చెప్పవచ్చునా ? బరువైన వస్తువును పారవేసిన నది త్యాగ మనిపించికొనునా? సన్యాసముయొక్క కఠినమైన శిక్షావిధానమును వారు పరిగ్రహించరు కాన సన్యాసులని పిలుచుటకును వీలులేదు. అనవసరమైన వస్తువులను త్యజించుటచే త్యాగమగునా? ఎవరు భోగవిషయముల మధ్య నిశ్చలులై నివసింతురో వారే నిజమైన సన్యాసులు. తమతోనున్న హీనభూతములు సుఖమును ప్రదర్శించుచున్నను, తమయందు సుఖసామగ్రిలు సిద్ధముగానున్నను యెవరుత్కృష్ట

మగు మనశ్శక్తిచే నా హీన భూతములను నిగ్రహించి యున్నారో వారే నిజమైన సన్యాసులు. ఆస్థితికి వచ్చిన పిదప వారు ప్రపంచమునుండి నివృత్తులై పారమార్థిక శక్తులను వికసింప జేసికొను నిమిత్తము తదితర శక్తుల నుపయోగ పరచవచ్చును. తమకేమి కావలసినను అంతరంగప్రపంచమందే సృష్టి చేసికోగలరుకాన వారు పూర్ణకాములై వర్తించెదరు. వారు స్వర్గమును సహిత మపేక్షించరు. ఏలయన, స్వర్గమునందు సుఖము కదా ప్రాప్తించుచున్నది! ఆసుఖ మిదివరకే వారికిలభ్యమై యున్నది. లోకమునకు హితమాచరించుటతప్ప మరియే హితమును వారపేక్షించరు.

అచ్చటచ్చట దివ్యజ్ఞానమందిరముల నేర్పరిచి వానిలో బుద్ధ్యభివృద్ధికిని, పారమార్థికానుభవమునకును తగు నుపాయములను గల్పించి సృష్టికాధారములైన మూలతత్వముల ననుసరించి యధ్యాత్మశాస్త్రమును బోధించుచు దమ్ముదా ముద్ధరించుకొను నుపాయమును జనుల కుపదేశించుచు వచ్చిన లోకమునకు చాల ప్రయోజన మగుచున్నది. అట్టి శాలలలో జ్ఞానశోధన కవ

సరమైన యవకాశము దొరకుచున్నది. ఇట్టి విద్యాశాలల నుగొన్నింటిని నిర్మించిన జగముయొక్క మానసికాకాశమం దుత్కృష్టములైన తారామండలములు వ్యక్తమై వానినుండి బయలుదేరు జ్ఞానజ్యోతికిరణములు లోకమునంతయు బ్రకాశింపజేయు చున్నవి. ఆధునిక భౌతికులకంటె నుత్కృష్టతరముగా బరిశోధనా కార్యముల నాశాలలయందు జేయవచ్చును. మతశ్రేష్ఠులు ప్రమాణములుగా నంగీకరించిన భిన్నాభిప్రాయముల దెలిసికొనినను మూఢ నమ్మకముచే బద్ధులుకాక, పండితులు పరిష్కరించిన సంగతుల నుపయోగము జేసినను నిర్దోషము లని భావించక విచారము జేయుచు వచ్చిన స్వంతముగా నాలోచించు సామర్థ్యము కలుగుచున్నది. అట్టివారు నివసించు యాలయములు ప్రజ్ఞామయశాలలై లోకమును వెలిగించగలవు. వారిప్రజ్ఞ కనుగుణముగా నాత్మనిగ్రహము కలుగునేని వారు బహు త్వరగా మహాత్మస్థితికి వెళ్లెదరు.

మహాపురుషు డీ వాక్కుల నసాధారణమైన యుత్తేజకశక్తిచే బలికినందున నచ్చటచ్చట మఠములనునిర్మించి పనిచేయు మని తనకాజ్ఞనిచ్చినట్టి పథికుడు భావించెను.

అజ్ఞుల కర్మలో బలాత్కారముగా ప్రవేశించ రాదను నియమ ముండుటవలన జనుల నిర్భాగ్యదశను దలచి తలచి యేమియు జేయజాలక దుఃఖానుకంపములతో బూర్ణుడై యున్న ట్లా మహాపురుషుడు గోచరించెను. అతడు సెలవిచ్చిన ట్లుత్యుత్తమములగు శిక్షాశాలల నేర్పరుచుటకు తనవద్ద తగిన యుపపత్తులు లేనందుకై పథికుడు వగచెను. ఒక తూరి తాను ధనాఢ్యుడైనచో నేలాగైన నొక శాలను నిర్మించి పరీక్షింప వచ్చునని కుతూహలము కలిగెను. అది మహాపురుషునకు గోచరించినందున నతడు మరల జెప్పసాగెను.

మహాపురుషుడు:—వేరువిధమున తెలియకుము. ద్రవ్యోపపత్తిలేమింజేసి మే మట్టి శాలలను నిర్మించలే దని తలచకుము. ద్రవ్యమువలన మర్త్యుల కుపకార మగు నేని మేము కావలసినంత స్వర్ణమును చేయగలము. నిజమును విచారించిన స్వర్ణము నరులకు శాపప్రదమై యున్నది. దానివలన వారికి దుఃఖముతప్ప మరియేమియు ఘటించదు. కాన దుఃఖప్రదమగు స్వర్ణమును వారి కిచ్చుట కిష్టములేదు. వారికెంతయధికముగ స్వర్ణము నిచ్చెదమో అంతయధికముగ నాశ వృద్ధి

యగును. స్వర్ణముతోఁగూడ శక్తినిజేర్చియిచ్చినవారు రాక్షసు లగుచున్నారు. కనుక, దివ్యజ్ఞాన శాలలను నిర్మించుకొఱకు ద్రవ్యముతోఁబనిలేదు. వానిని ప్రయోజనకరముగా నడపించు సామర్థ్యముగల వారు కావలయును. వారా శాలలయందే నివసించుచు సత్యాన్వేషణపరులై వర్తించవలెను. ఇట్టివారు దొరకుట దుర్లభమైయున్నది. లోకములో మేధాశక్తిని వృద్ధిజేయు విజ్ఞానమును సంపాదించుటకై బహుజనులు యత్నించుచున్నారు కాని ఆత్మప్రకాశమునకు సాధనమైన జ్ఞానముకొఱకు కొందరుమాత్రమే ప్రయత్నము చేయుచున్నారు. బుద్ధిచులుకు, ఉపాయము, కపటము, చాతుర్యము జ్ఞానముయొక్కచిహ్నములని యనేకులు భ్రాంతులైయున్నారు. ఇది తప్పు. పశుయుక్తి జ్ఞానమగునా ? ఉపాయము ప్రాజ్ఞతయనుపించుకొనునా? మీపండితులు సత్యదర్శులుకారు. యోగమార్గస్థులమనిచెప్పుకొనువా రనేకులు తమవాాంఛ్య కుతూహలమును తృప్తి పరచుకొను నిమిత్తమా మార్గముయొక్క యభ్యాసములను పరిగ్రహించి యున్నారు. మరికొందరు ప్రకృతిరహస్యములనుదెలిసికొని వాని సహాయముచే స్వప్రయోజనమును పొందవలెనని

యత్నించుచున్నారు. సత్యమును దప్ప మరి దేనిని గోరకయున్న స్త్రీ పురుషు లెచ్చట నున్నారు? అట్టి వారిని జూపిన వారి యోగక్షేమమును మేమే విచారించెదము. సుఖమం దాశలేని వానిని కాపాడుట కెంతద్రవ్యము కావలెను? రుచ్యములైన పదార్థములపై యాశలేని వాని భోజనమున కెంత సెలవు కావచ్చును? ప్రకృతియొక్క పుస్తకాలయమున జదువుకొనువారికి లోకములోని పుస్తకభండార ములతో బనియేమి? ఇంద్రియ జన్మమును వదలి యంతరంగజన్మమం దాసక్తుడైనవానికి బాహ్యరూపములు తృప్తి నివ్వగలవా? ఆత్మస్వర్గమందు నివసించువానికి భూతలభాగము లింపుగా నుండునా? తన పరమాత్మతో సంభాషించుచుండువాని కితరుల సంగము హితమగునా? దేవుని సాన్నిధ్యమం దే సదా యుండువారి నెవరు వినోదింప జేయగలరు?

ఇట్లు పలికి మహాపురుషుడు కొన్ని నిమిషము లూరకయుండెను. పథికుడు నిరీక్షణ భావమందుండినందున నతడు మరల జెప్పసాగెను:—ఆహా! నేనూహించు దివ్యజ్ఞానమందిరము మా యాశ్రమముకన్న నెంతయో

యతిశయమై యున్నది. దాని స్థానము భూమికి బహుదూరమందున్నను దానిని పొందుటకు ద్రవ్యము కాని, శ్రమకాని యవసరములేదు. ఆమందిరమున నివసించు స్త్రీపురుషులు జీవభావము నతిక్రమించి యున్నారు. దాని దేవాగార మనంతవిస్తారమై యున్నది. సర్వస్వామై యున్న పావనచరితుఁడు దానియందు ప్రతిష్ఠింపబడియున్నాడు. ఆమందిరమందు విశ్వాత్మకుని నానాత్వమణఁగి యేకత్వము స్థాయిగానున్నది. ఆమఠమందు స్త్రీపురుషభేదములేదు; భిన్నభిన్నరుచులు లేవు; భిన్నాభిప్రాయములు లేవు; భిన్నమైన మనోరథములు లేవు. దానియందు దుర్నడత ప్రవేశించుటకు వీలులేదు; దానిలో జననములేదు. మరణములేదు. దానియందున్నవారందరు దేవతలవలె నివసింతురు. దానిలో ప్రతివారు లోకోపకారశక్తికి స్థానమై యుందురు. ప్రతివారఖండజ్యోతిస్సముద్రమందు మునిఁగి యుందురు. చూడఁగోరిన దానిని జూచుచు, తెలియఁగోరిన దానిని దెలిసికొనుచు, నచ్చట ప్రతివారు శక్త్యాకారములయం దతిశయులై సర్వము తామై సర్వముతో నేకీభవించినవారై యుందురు.

జ్ఞానముయొక్క పరమావధినిసూచించు యీవాక్కులను జెప్పుచు మహాపురుషు డూహించుట కసాధ్యమైన నిర్వాణానందములో మగ్నుడైనట్టు గోచరించెను. కొంతకాల మాస్థితిలోనుండి తరువాత నేత్రములను దెరువ వానియందు తేజము మరల ప్రకాశించెను. తాను ముచ్చటించిన యుత్కృష్టాభిప్రాయములచే దాను పరవశుడైతినని చెప్పెను. మానవవర్గ మత్యున్నతమగు నట్టిస్థితికి నచ్చుట కింకను వేయూరుసంవత్సరములు గడవవలెనుకదా యని పథికుడడిగెను.

మహాపురుషుడు.—మిత్రుడా! ఇప్పటి నాగరికతలో జనుల బహిర్ముఖమున కాకరములైన సందర్భములే యధికముగా నున్నవికాని యంతర్ముఖమున కనుకూలమైనవి లేవు. అందువలన, జనులు తాము కాలశక్తులను విశేషముగా బాహ్యవ్యాపారములయందే వినియోగించుచున్నారు. ప్రతి నరునియందును వానివానికి దగిన శక్తి కొంచెముండును. ఆ కొంత శక్తి నింద్రియ సుఖములకొరకుగాని, మేధాశక్తిని వృద్ధి జేసికొనుట యందుగాని యుపయోగ పరచిన వాని హృదయాంతరంగమున నుండు యాత్మ

బీజమును బోషించుటకు శక్తియే లేక పోవును. మనుష్యుడు తనమనస్సును పలుమారు బాహ్య విషయములయందే ప్రవర్తింప జేయుచుండిన నాత్మాభివృద్ధి కవశ్యకమైనయంతర్ముఖధ్యానము చేకూరదు. లోకమందు కూలివాండ్రు, వ్యాపారులు, భౌతికులు, వైద్యులు, వకీళ్లు, మతబోధకులు, మరియు నితరవృత్తులవారుబహిర్ముఖులై బాహ్యవ్యాపారములయందే మగ్నులైయున్నారు. ఆంతరంగికశక్తులను ధ్యానించుటకు వారికి సమయమే లేదు. బహుజనులు కల్పితవస్తువులయం దాసక్తులై యున్నారు. ఆవస్తువు లొక్కజన్మమునందే ప్రయోజనకరములై యుండును. హృదయనాడులు ఛిన్నము లగునపు డవి యన్నియు నిరర్థకము లగుచున్నవి. తమ జీవనమునకు గావలసిన యుపపత్తులను సంపాదించుటయందే జనులకు కాలశక్తులు క్షీణమగుచున్నవి. ఇందు నిమిత్త మనేకులుత్తమమార్గమునకు బోవ తమకు వీలు లేదనునెపమునుజెప్పుచు విచారపడుచున్నారు కాని ప్రకృతిమాత్రము మానవుల సాకుల నంగీకరించదు. కార్యకారణనియమమునకు సాకులవలనగాని, వివాదముల వలనగాని ప్రమాదము తటస్థించదు. కొండనెక్క

చుండగా నాకస్మికముగా పడిన మెడవిరుగులాగున బుద్ధిపూర్వకముగా పడినను నశించును. అభివృద్ధి యగుటకు శక్తిలేకున్నవాడు, నభివృద్ధియగుట కిష్ట ములేనివాడునొకటే. ఇద్దరువెనుకనిలిచెదరు. ప్రకృతి బహిర్ముఖునకు తోచునంతటి క్రూరమైనది కాదు. మనుష్యమాత్రునకుజీవనమునకు కావలసినది మిక్కిలి కొంచెము. దానిని సులభముగాసంపాదించికొనుటకు ప్రకృతి సౌకర్యముల నిచ్చియున్నది. ప్రకృతి ప్రాణు లకు తల్లికదా! ఆమె తనబిడ్డలకుగావలసినదానిని సిద్ధ ముగా నమర్చియున్నది. వారివారికి గావలసిన దానిని ప్రాణు లేర్పరచుకొననచ్చును. అదిదొరకకున్న వారి దోషమే. లేక వారుచేరియుండు సంఘముయొక్క చట్టములలో నెద్దియో యొక లోపమున్నదని చెప్ప వలెను. ఈభాగమందు ప్రకృతినిందార్హమైనది కాదు. సంఘముయొక్క యేర్పాటులలో నొకకొరతయున్న దని నిస్సందేహముగాజెప్పవచ్చును.ఆకొరతనుపోగొ ట్టుటకై తత్వజ్ఞులు, రాజ్యతంత్రజ్ఞులు పలువిధముల బాటుపడుచున్నారుకాని వారిపరిహారవిధానము ఫల కారికాలేదు. ప్రకృతిధర్మముల కనుగుణముగా మాన వకృతనియమము లెప్పుడేర్పడుచున్నవో అప్పుడువారు

కల్పించుపరిహారక్రమములు ఫలదాయకము లగుచు న్నవి. ఇది సాధ్యమగుటకు చాలకాలముపట్టును. అంతవరకూరకయుండుట సాధ్యముకాదు కాన ప్రతి మనుష్యుడు తనజన్మమును స్వభావ నియమముల కనుగుణమగునట్లుచేసికొని వర్తించిన సంఘము బాగు పడును.

పథికునికి బాహ్యసుఖములయందు చాల కోరిక యుండెను. మహాపురుషుడు వానిని తృణీకరించి మాట లాడగనే వాని మనస్సుకు విరుద్ధముగదోచి యిట్లుపలుక నారంభించెను:—

పథికుడు:—మానవనాగరికతలో నవశ్యకములుగా నేర్పడి యున్న సుఖసాధనములను విడువవలెనని తమరు సెలవిచ్చెదరా? అప్రబుద్ధులుగా నున్న మనపూర్వుల వలె మనము పశుస్థితియం దుండవలెనని మీయభి ప్రాయమా? ఇట్టి పిచ్చియభిప్రాయ మనేకుల కున్న దని నాకు తెలుసును.

మహాపురుషుడు:—అదికాదు. ఆవశ్యకములుగా నేర్పడి యున్న యనేకపదార్థములు కల్పితావశ్యకములే కాని నైజములుకావు. నవనాగరికులు కల్పించిన వస్తు

వులు లేకమునుపు మనపూర్వులు సుఖముగను, దీర్ఘాయువులుగను నుండలేదా? ఆవశ్యకములను శబ్దమున కర్థమేమి? రాజుకు నాలుగు ప్రాసాదములావశ్యకమైన ట్లొక ప్రభువుకు నాలుగుగుఱ్ఱములు, బండి యావశ్యకమే. అలాగుననే యొకబీదకు సారాయిబుడ్డి, సొగసుకానికి పట్టుఅంగరేఖ ఆవశ్యకములగుచున్నవి. ఆవశ్యకములను పదమునకు క్లుప్తమైన అర్థమున్నదా? వస్తువులను జూచి వాని లోనివి యావశ్యకములని నిర్దేశించుటకు సాధ్యముకాదు కాని చిత్తవృత్తినిబట్టి యావశ్యకములుండును. కల్పితములైన యావశ్యకములను పొందుటకై మనుజుడు చాల శ్రమపడవలసి వచ్చును. నేను శ్రమపడజాలననిన నావశ్యకము లనావశ్యకములుగా నెంచరాదు. ఆ క్లెంచ కుండుటచేత వృథా భ్రాంతి సిద్ధములైన వస్తువులకొరకు పాడగుచుండిన శక్తి మిగిలి నిజముగా నావశ్యకమైన వస్తువును సాధించుట కుపయోగమగు చున్నది. ఏది శాశ్వతమైనదో అదియే యావశ్యకమైనది; ఏది యశాశ్వతమైనదో యది యనావశ్యకము.

బాహ్యవస్తువుల జ్ఞానమును సంపాదించుటకొరకనే కులు క్రూరకర్మములను జేయుదురు. బ్రతికియున్న ప్రాణిని కొంచెముకొంచెముగా గోసి జ్ఞానమును సంపాదించుటకంటె నస్వాభావికమైన కార్యమేమియున్నది? ఆపనిచేయువారిలో జీవకారుణ్యా మేమూలలో దాగికొని యున్నదో దేవునికే తెలుసును? ప్రకృతియొక్క యాంతరంగిక ధర్మములను గనుగొన యత్నించుచున్న భౌతికజ్ఞులు దానిసామాన్య నియమముల నెందుకు గమనించరో యూహింపజాలను. ఒకయాకుపై బ్రాకుచు నామూలాగ్రముగా వృక్షముయొక్క సంగతిని దెలిసికొని యున్నానని భావించుపురుగువలె భౌతికజ్ఞుల జీవితమున్నదని చెప్పవచ్చును. ప్రకృతికి సంబంధించిన శాఖలనన్నిటిని బరిశోధించుట భౌతికులకు విహితధర్మముగా నున్నది కాని తమ యంతరంగమున నుండు శక్తులను వికసింపజేసికొని వారు పరిశోధించినమంచిది.ఇదిగాక, ప్రధానశక్తులు లోపలనుండి పనిచేయుచున్నవి. బాహ్యమున గోచరించునవి కార్యములేగాని కారణములుకావు. కారణములను బరిశోధించుటయే ముఖ్యమైన పనిగాని కార్యములను నిర్దేశించుటకాదు. దైవజ్ఞానముకంటె బాహ్యవస్తువుల జ్ఞానము ముఖ్యమని భావించువారల ప్రాజ్ఞులని చెప్పవలెను.

పథికుడు :— దేవుని విషయమై మనమేమి తెలిసికొనఁగలము? దేవుడున్నాడనుటకు నిదర్శనమేమి?

మహాపురుషుడు:—ప్రతి పదార్థమందును దేవుడున్నాడని యెవరెరుగరో వారు పశ్చాత్తాపమున కర్హులై యున్నారు. బ్రహ్మమొదలు పరమాణువువరకు గల సర్వపదార్థములందు దేవుడు ప్రాణదాయకుడై యున్నాడు. అతడు మనస్సుకు గ్రాహ్యమగువాడు కాడు. మేధాశక్తికి గోచరించడు. ప్రజ్ఞచే దెలిసికొనవచ్చుననిన నాప్రజ్ఞ యతనికంటె నధికమగుచున్నది. అతనియొక్క శక్తి విశేషమే ప్రకృతియై యున్నది. అతడొకడే సద్వస్తువు. అతడుతప్ప మరియే సద్వస్తువులేదు. మరియొకరిచే నతడు నిదర్శనమునకు రాజాలడు. ప్రతి మనుష్యు డతనిని దనలోదాను సాక్షాత్కరించి కొనవలెను. అతని యనుగ్రహముచే ప్రతిప్రాణియు నతనిశక్తి సాన్నిధ్యములను బొంది యతనిని నిదర్శనమునకు తెచ్చికొనును. తనలో నాస్వామిని ప్రతిష్ఠించుకొరకే మానవుడీ లోకమందున్నాడు. మనుష్యుడు తనహృదయమందాస్వామి నెప్పుడు సాక్షాత్కరించికొనునో అప్పుడే

వానిజన్మయాత్ర ముగిసి వాడు పుట్టినయుద్దేశము నెరవేరుచున్నది. నీకు శాంతి యగుగాక!

ఈమాటలు ముగిసినవెంటనే పైభాగమున నొక ఘంటారవమువినవచ్చెను. పథికుడు తలయెత్తిచూచెను. ఏమియు గోచరించలేదు. వెండిఘంటలనినదము మాత్రము చెవిని పడుచుండెను.

మహాపురుషుడు:—మాయాశ్రమసోదరులందరు భోజనశాలలో సమావేశమై యున్నారని యీఘంటారవము సూచించుచున్నది. మనమిరువుర మచ్చటకు వెళ్లుదము. కొద్దిగా నీవు ఫలములను భుజించిన శ్రమ పరిహారమగును.

తృతీయాధ్యాయము సంపూర్ణము.

---

# సిద్ధాశ్రమము.

## చతుర్థాధ్యాయము.

---

### భోజనశాల.

మహాపురుషుని వెంబడించి చిన్నమిద్దెలోదూరి పథికుడు తోటను ప్రవేశించెను. ఇంతకు మునుపు తాను చూచిన హిమపఙ్క్తులు కాని, దేవదారువనములు కాని యాతోటలో సొంపుగా బెరిగియున్న సాలాదివృక్షముల మనోహరమైన చూపుకు సమముగా నుండలేదు. జాజి, సంపంగి, మల్లెపుష్పముల పొదలు దట్టముగా వ్యాపించియుండెను. వాని మధ్యభాగమున నచ్చటచ్చట గులాబీ పుష్పముల పొదలు మిళితమైయుండెను. వానిలో వికసించియున్న కుసుమముల సుగంధ పరిమళము నలువైపుల వ్యాపించుచుండెను. అచ్చటనున్న కొన్ని విదేశ సస్యములు పథికునకు బరిచయము లేకయుండెను. ఉష్ణమండలములోని తరులతా గుల్మాదులే గోచరించుచున్నను, యాయుపవన ముష్ణక్షేత్రమైయుండలేదు. ఊర్ధ్వ

భాగమున యనంతవిస్తారమైన నీలాకాశము, అధోభాగ
మున నుష్ణప్రదమగు భూతలము, మధ్యభాగమున పచ్చ
గానున్న వివిధవృక్షములు పథికునకు గోచరించుచు
మనోల్లాసమును గలుగజేయుచుండెను. వారివారి యా
త్మీయ స్వర్గమందున్నవారికి బాహ్యసుఖములు రుచింప
వని మహాపురుషు డానతిచ్చిన వాక్కు కాయుపవనము
భిన్నముగా నున్నట్లు వానికి గోచరించెను. మహాపురుషు
డీభావమును గ్రహించి చెప్పసాగెను.

మహాపురుషుడు—నీ వీయాశ్రమమును దర్శించునపు
డన్నియు నీకు మనోహరముగా నుండులాగున మేమీ
మాయలను గల్పించియున్నాము. తోటవాడు లేకనే
యీతరులతాదులు పెరిగియున్నవి. సంకల్పశక్తి తప్ప
వీనికై మరి యేమియు సెలవుకాలేదు.

ఈ వాక్కులచే విస్మయమొందిన పథికు డొక గులాబి
పొదయొద్దకు వెళ్లి యొకపుష్పమును గోసి తన హస్తమం
దుంచుకొని చక్కగా బరీక్షించి చూచెను. అది నిజమైన
పుష్పమైయుండెను. మంచి పరిమళము నిచ్చుచుండెను.
తపనుని మాధ్యాహ్నిక కిరణములచే నప్పుడే వికసించిన
కర్ణికలు గలదై యుండెను.

పథికుడు—నాహస్తములోనున్న యీపుష్పమును భ్రాంతి సిద్ధమైనదని నే నూహింపజాలను. నాసంకల్పముచే పుట్టియున్నదని నమ్మజాలను.

మహాపురుషుడు—నిజమే. నీసంకల్పముచే నది పుట్టినది కాదు. దానిని ప్రకృతి కలుగజేసి యున్నది. ప్రకృతియొక్క వ్యాపారమును తన యిచ్ఛాశక్తిచే యోగి నియమనము చేయగలడు. గ్రహములు, పర్వతములు, సముద్రములు, నదీనదములు, నానావస్తువులతోఁగూడిన భూతలము రూపోత్పత్తి కాధారమైన మనస్సమష్టియొక్క కల్పనాశక్తిచే ప్రకాశించుచున్నవి. వస్తువులన్నియు ప్రకృతియొక్క భ్రాంతిరూపములే కాని వాస్తవములు కావు. ప్రకృతిమయము కాని పదార్థమే యగ్రాహ్యము, యప్రసిద్ధము. సమష్టిమనస్సుకు ప్రకృతియే యావరణముగానున్నది. దానికధిభూతాకాశమని పేరు. ఆకాశము లేనిస్థలమే లేదు. ఎప్పుడీయాకాశము పార్థివతేజముం బ్రవేశించుటకాకరమై ఘనీభవించునో యప్పుడది నీయింద్రియములకు బాహ్యముగా గోచరించును. సర్వవ్యాపియగు నిచ్ఛాశక్తిబాహ్యవస్తువులయం దన్నిటిలోనున్నది.

యోగియొక్క ప్రజ్ఞ నలువైపుల వ్యాపించియుండును. దానికి తన దివ్యశక్తిని జేర్చిన మనస్సమష్టిలో గోరిన రూపముల నతడు సృజించగలడు. మనస్సమష్టి స్వరూపుడైన బ్రహ్మయొక్క క్షేత్రము, యోగియొక్క క్షేత్రము నొకటిగానున్నది. యోగి మనమున కల్పితములగు రూపము లొకవిధమైన శక్తివిశేషముచే ఘనీభవించి పదార్థములుగా నీకు గోచరించుచున్నవి.

పథికుడు—తమరు సెలవిచ్చినయంశము నామనస్సుకు పట్టలేదు. తమమనస్సులో బుట్టుతలంపులు స్థూలరూపమును బొంది బైట గోచరించుచున్నవని తెలియవలెనా? నాప్రశ్నకు క్షమించి దయచేసి జవాబు చెప్పగోరెద. ఈ ప్రశ్నచే వినోదమునొంది మహాపురుషుడు చిరునవ్వుతో జెప్ప నారంభించెను.

మహాపురుషుడు— నరునకావాసస్థానమగు మనోమయప్రపంచము పారిదేశమాత్రమైనవాని హృదయమున నిమిడియున్నదని తలచెదవా? అట్లు తలచువారు పశ్చాత్తాపార్హులై యున్నారు. ఒకవేళ యది నిజమని నమ్మిన తన హృదయములో తటస్థించని సంభవములను మనుష్యుడు చూచుటకును,

యనుభవించుటకును సాధ్యముకాదుకాన బాహ్య ప్రపంచమందేమి ఘటించినను వానికి తెలియకపోవు చున్నది. సూర్యుడుగాని లేక మరియేబాహ్యావస్తువు గాని వాని కగుపడను వీలులేదు. ఏలయన, మనస్సులో లేనిది బాహ్యామందు కనపడు టెట్లు? మనుష్యునిమనస్సు ప్రదేశమాత్ర మగువాని మెదడు లోనే యున్నదనుట విరుద్ధాభిప్రాయము. అదియెంత దూర ప్రదేశమునకైనను పోగలదు. నక్షత్రమండలమునకును, మరియు నంతకన్న దూరదేశములకును మానవునిమనస్సువెళ్లగలదు. స్థూల దేహామందున్నను బహుదూరములో నుండువస్తువునది నిరాయాసముగా బొందగలదు. మనస్సు దూరదేశమునకు వెళ్లి దర్శించినపదార్థముల పరిస్ఫురణములను స్థూలదేహాము లోని మెదడు కంకితము చేయు సామర్థ్యమును గలిగి యున్నది. మనస్సుచే నంకితము చేయబడు పరిస్ఫురణములను బరిగ్రహించుటకు మాత్రమే మెదడుకు శక్తి యున్నదికాని మరి యెట్టిశక్తియు లేదు.

ఇన్ని విధముల జెప్పినను పథికుని మనస్సు కర్థము కాలేదు. ఈసంగతిని గనుగొనిన మహాపురుషుడు సమీపమందున్న యొక వృక్షరాజము వంకకు పథికుని

దృష్టి నాకర్షింపజేసెను. ఆతరు శ్రేష్ఠము 60 అడుగు లెత్తు గలదై యుండెను. దాని పై భాగమున నందములగు తెల్లని పుష్పములు శోభించుచుండెను. పథికుడా చెట్టును తన నేత్రద్వయముతో బాగుగ జూచెను. చూడజూడ నది చిన్నదగుట కారంభించెను. దాని పచ్చనియాకులు తెల్లగ మారినందున పుష్పములకును ఆయాకులకును భేదము లేకపోయెను. ఇంకను చూడజూడ నావృక్షము పిశాచమువలె సూక్ష్మమైన రూపమునుబొంది యంతర్ధానమాయెను.

మహాపురుషుడు—చూచితివా? నీమనస్సులో నున్నట్టె యావృక్షము నామనస్సులో నుండెను. మనమందర మొకరి మనోరాజ్యమం దొకరు పరస్పరముగా నున్నాము. దివ్యదృష్టి గలవారితరుల మనస్సులో బుట్టురూపములను జూడగలరు. సామాన్యమనుష్యులు ప్రకృతిచే గల్పింపబడిన రూపములను, ఇతరులు కల్పనాశక్తిచే నిర్మించిన రూపములను జూడగలరు. యోగులైనచో తమకిష్టములగు రూపవిశేషములను సంకల్పశక్తిచే నిర్మాణముజేసికొని వాని మధ్య నివసించగలరు. నీకు గోచరములగు వస్తువులన్నియు మాప్రజ్ఞారాజ్యమందున్నవి. మాప్రజ్ఞారాజ్యము సంకోచ

మైనదికాదు. మాచుట్టు నలువైపుల నుండువస్తువు లెంతదూరమువరకు వ్యాపించియున్నవో యింతకం టె నధికముగా మాప్రజ్ఞారాజ్యమున్నది. జగముతో నేకీభవించునంతటి విస్తారముగా మాప్రజ్ఞయున్నదని తెలియుము.

మానవులకు సంకల్పశక్తియొక్క మహిమ చక్కగా తెలియలేదు. తెలిసినయెడల సంకల్పముచేయుటకు చాల జాగరూకులై యుందురు. సంకల్పమువలన రూపములు పుట్టుచున్నవి. దుష్టసంకల్పములుగానున్న పిశాచరూప ములు, సత్సంకల్పములుగానున్న దేవతారూపము లుత్ప న్నమగుచున్నవి. అవి రానురాను ఘనీభవించి చైతన్య యుక్తములై తమ్ము గలుగజేసిననరులు మృతినొందినను యవి జీవించి యుండును. సంకల్పరూపములు మృతులను వెంబడించి పోగలవు. తమ్ము గలుగజేసిన వారివెంబడి పోవుట వస్తువులకు సహజధర్మముకదా!

పథికుడు:—అట్లైన, దుస్సంకల్పమువలన పిశాచరూప ముత్పన్నమగుట నిజమేనా?

మహాపురుషుడు:—ప్రతి సంకల్ప మొక రూపమును గలుగజేయుట నిజమేకాని యా రూపమునకు మన

యిచ్ఛాశక్తి చేరకున్న నీడవలె నది త్వరగా నదృశ్యమగుచున్నది. ఇచ్ఛచే మరలమరల పోషింపబడు సంకల్పరూపము చైతన్యయుక్త మైన "జీవిగా" పరిణమించుచున్నది. మనసంకల్పమాత్రమున బయలు వెడలు "సంకల్పరూపమునకును," ఇచ్ఛాశక్తివలన చైతన్యమును బొందు "సంకల్పవ్యక్తికిని" భేదమున్నది. సృష్టిలోనే యిట్టిభేదము లేకుండిన కూరకృత్యమును మనమర్థము చేసుకోవలసినప్పుడెల్ల "సంకల్పవ్యక్తినే" బుట్టించుచు చాలపాపమునకు మనము గురియగుచుందుము. ఇప్పుడు మనము దుష్టసంకల్ప వ్యక్తులను నిర్మించకనే దుర్మార్గమును గ్రహించగలము. దుర్మార్గమును జేయవలెనను యిచ్ఛలేక దుర్మార్గమును దలచినమాత్రమున నది కార్యకారికాజాలదు. బాహ్యోపపత్తులనుకూలములై యుండి దుర్మార్గమును జేయ నిచ్ఛయించిన "సంకల్పజీవి" తప్పకపుట్టుచున్నది. దానిని మరల స్మరించక విడిచితివేని యది క్రమేణ యదృశ్యమగుచున్నది. కాని దానిని బుట్టించిన దోషము నీకు తప్పదు. ఇచ్ఛాశక్తియు, ప్రాణశక్తియు నొకటేకాన నిచ్ఛాశక్తిచే జనించు సంకల్పరూపములకు ప్రాణము తప్పక వచ్చుచున్నది.

పథికుని మనస్సునకు మరియేదియో నొకసంశయము కలిగెను. దానిని గ్రహించి మహాపురుషుడు మరల చెప్పసాగెను :—

మహాపురుషుడు :—ఇచ్ఛాశక్తిని ప్రాణప్రదశక్తియని నీకు బోధించితినిగదా! అది నరుల మెదడులో వెల్లడియగుశక్తి కాదని తెలియుము. వారి హృదయాంతరంగమున నది ప్రకాశించుచున్నది. అది పారమార్థికశక్తిగానున్నది. మెదడుగుండా ప్రకాశించు శక్తి వస్తువులకు వేడిమిని గలుగజేయనేరని చంద్రకిరణములవలె నున్నది. హృదయమునుండి ప్రకాశమగు నిచ్ఛాశక్తియైననో ఖనిజములకును సస్యములకును, పశువులకును చైతన్యమునిచ్చు సూర్యకిరణములవలె నున్నది. మెదడులో బుట్టుతలంపులకు చైతన్యము నిచ్చు త్రాణలేదు. సంకల్పముచే వస్తువులను నిర్మించుశక్తి జనులకింకను రాకుండుట యెంతయో మేలు. వారి కట్టిశక్తివచ్చియుండిన లోకములో సర్వజనులను మ్రింగు రాక్షసాకారముగల "సంకల్పవ్యక్తులను" నించియుందురు. ఇప్పటినాగరీకతలో దుస్సంకల్పములను జేయునరులే యధికముగా నున్నారు కాని

సత్సంకల్పపరు లరుదు. అయితే, వారుచేయు సంకల్పములు మెదడులో బుట్టుచున్నవి కాని హృదయమందు జనించవు. ఆకారణముచేతనే యవి ఫలప్రదములు కావు. వారి దుష్టసంకల్పముల నుండి దుష్ఫలము లొకవేళవచ్చిన నవి వారికే పోవునుగాని యితరులకు వ్యాపించవు. అందుచే, మానవులు సద్గుణసదాచార సంపన్నులు గాకున్న పారమార్థిక శక్తులు వారి యాధీనముగాకుండుట మంచిది. పూర్వకాలమున నీ శక్తులవిషయమై పామరులకు బోధించుచుండలేదు. వీనిని పరమరహస్యముగా బెట్టుకొని యుండిరి.

ఇట్లు పరస్పరము సంభాషించుచు వా రిరువురు నొక పడసాలకువచ్చిరి. దానిలో షట్కోణాకృతి గల యొక గదియుండెను. ఉన్నతములైన నాలుగుకిటికీల ద్వారా యాగదికి వెలుగువచ్చుచుండెను. దాని మధ్యభాగమున నొక బల్లయుండెను.ఆ బల్లచుట్టు కుర్చీలు వేయబడియుండెను. మూలలలో వివిధపరికరములుంచబడియుండెను. ఆశ్రమసోదరు లచ్చోట సమావేశమైయుండిరి. వారిలో గొందరు దేశచరిత్రలలో విఖ్యాతులైనవా

రని వారిభావ చిత్రస్ఫూర్తిచే పథికుడు కనుగొనెను. ఆ గుంపులో స్త్రీసన్యాసిను లిద్దరుండిరి. వారినిజూచి పథికుడు విస్మయ మొందెను. ఒక యువతి యున్నతకాయముగలదై గంభీరభావముతో గూడియుండెను.

మరియొక విరాగిని పలచని దేహముగలదై మృదుమనోహరభావముతో విలసిల్లుచుండెను. ఆ సంఘమున స్త్రీసాధువు లుండుటెట్లని వాడాలోచించెను. వాని యాలోచన యచ్చట సమావేశమై యున్నవారందరికి గోచరించెను. వారిని క్రమముగా బథికునకు బరిచయము జేయించిన పిదప దీర్ఘకాయముగల స్త్రీసాధువు వాని హస్తములను బట్టుకొని బల్లయొద్దకు తీసికొని వెళ్లెను. అచ్చట మందహాసముతో నిట్లు చెప్పసాగెను:—

“మిత్రుడా! స్త్రీసాధువులు పురుషరూపముతో నున్న తమసోదర సాధువులతో నివసించుచున్న మాత్రముననే నీ వాశ్చర్యపడుటకు కారణమేమి? స్త్రీ పురుష భేదము దేహముననేగాని యాత్మకులేదు. కామవృత్తి నాశమైనపిదప స్త్రీపురుషభేదమువలన నేమి ప్రయోజనము. నీవు నాప్రక్కలోనే కూర్చుండి మధురములైన యీ పండ్లను భుజింపుము.”

బల్లపైన వివిధఫలము లుంచబడియుండెను. వాని లో కొన్ని శీతల ప్రదేశమందు దొరకునవిగా నుండ లేదు. పథికునకు వానిపేర్లే తెలియక యుండెను. సోదరు లందరు తమతమ యాసనములపై కూర్చుండిరి. సంభాషణ యుపక్రమింపబడెను. అందరు భాగులైరి. ఉత్కృష్టమైన యాసభలో తానొకడే యత్యల్పుడని పథికునికి స్ఫురించెను. కాని అచ్చట సమావేశమైయున్న వారందరువానిని సమానునిగా భావించిరి. వాని మనస్సుకు తటస్థించిన ఖేదమును బోగొట్టి యద్భుతోల్లాసమును బుట్టించిరి. అతిథిసత్కారనియమము ననుసరించి వానిని భుజింపజేసి తామందరు మౌనముగ గూర్చుండిరి. సొంపుగానున్న ప్రాతఃకాలపు పర్యటనమువలనను, పర్వతములో వీచుచున్న నిర్మలమైన మందమారుతమువలనను, చాల యాకలిగొని యున్నందున వా డమృతమువలెనున్న యాఫలములను భుజించ నారంభించెను. వాని పార్శ్వమందున్న యబలామణి యహేతుకమైనవాని భీరుత్వమును బోగొట్టుచు నాంతరంగికశక్తుల విషయమై వా డడిగిన ప్రశ్నలకు సదుత్తరములనిచ్చుచు ననుభవదృష్టాంతములను జూపుచుండెను.

ఆత్మశక్తులను బరిశోధింప దలచువా రతులధైర్య వంతులు కావలెనను ప్రస్తావము నడచెను. "రాక్షసకృత్యములతోను, పశుస్వభావముగలవ్యక్తులతోనునిండి యున్న "భూతప్రపంచము" మానవుని యుత్క్రాంతికి కుందకమైయున్నది. నరుని స్వభావమందున్న పశుభూతములు వాని యాచరణ నాశ్రయించియున్నవి. వాని హృదయమందు దైవభావము తలచూపిన వెంటనే వాని నాశ్రయించికొనియున్న పశుభూతములకు వినాశకాలముప్రాప్తించును. అప్పుడాభూతములు క్షోభకలిగిన మృగములవలె తమప్రాణములకొరకును, ఆహారముకొరకును హాహాకారముజేయుచు తమకాశ్రయుడైయున్న నరునియుత్క్రాంతికి ప్రతిబంధకములను గలుగజేయుచుబగనుసాధించుచున్నవి. ఆహీనభూతములు దేహాత్మ్నని నీచస్వభావమందు జేరికొని సామాన్యముగా బాహ్యేంద్రియములకు గోచరించవు. అసాధారణములైన కొన్ని సందర్భములయం దవి స్థూల పదార్థములవలె నేత్రములకు గోచరించుచున్నవి. అవి గుంపులుగుంపులుగా నివసించుచు పశువులవలె తమకుటుంబములను వృద్ధిజేయయత్నించుచున్నవి. వాని కొక సమయమందు పరస్పరముగా పోరాటము సంభవించి యొకటి నొకటి తినుటయుకలదు.

మనుష్యునియందు బుట్టు చిన్నచిన్న స్వార్థాపేక్ష లనేకములు చేరి పెను బామువలెనుండు కామమునకు గ్రాసమైనిలిచిన పిశాచమువలె పెద్దగానున్న ప్రాణి చిన్న చిన్న ప్రాణులను మ్రింగినట్లగుచున్నది.'' అని యా నారీమణి పలికెను.

నరుడు జంగమ పశు క్షేత్రమై యున్నాడని నమ్ముట పథికునకు సమ్మతముకాలేదు. భూత వ్యక్తులలో నొకటినైనను ప్రత్యక్షముగా జూచిన నమ్మవచ్చునని పలికెను.

యువతి:—అట్టి ఘోరతరమగు వ్యక్తిని జూచి నీవు వెరగొందవా?

పథికుడు:—నేత్రములతో జూడ గలుగు వస్తువును చూచుటకును, హస్తములతో స్పర్శించు వస్తువును స్పర్శించుటకును నేను జడువను. భయ మజ్ఞానము వలన కలిగి జ్ఞానము వలన నశించుచున్నదికదా!

తాను ధైర్యవంతుడ నని చెప్పుకొన్న పథికుని గురించి ''నీమాట నిశ్చయమే కాని యచ్చట నుండు

పండ్లబుట్టను దయచేసి అందుకొనుము" అని యామె ప్రార్థించెను.

బల్లపై నున్న పండ్లబుట్ట నందుకొనుటకై పథికుడు తన హస్తములను జాపెను. ఆబుట్టలో ఫలముల మధ్యమున నొకపాము హఠాత్తుగా పైకిలేచెను. కోపాగ్నిచే నది బిగ్గరగా బుసుగొట్ట నారంభించెను. కఱచునేమో యను భీతిచే పథికుడు తన చేతిని వెనుకకు తీసెను. కొంత తడవైన పిదప బుట్టలో జూచెను. ఆపాము పండ్లమధ్య చుట్టుకొని యుండెను. దాని శబ్దము క్రమేణ తక్కువదై చివరకది యదృశ్యమాయెను.

దీనిని సాక్షిభూతులుగా జూచుచుండిన సోదరులలో నొకరు "నీ వాపామును ముట్టుటకు సాహసించి యుండిన నది కల్పిత మైనదని నీకు దృఢముగా తెలిసి యుండును." అనిచెప్పిరి.

మహాపురుషుడు:—ఇచ్ఛాశక్తిని ప్రాణ ప్రదశక్తి మాత్రమేయని తెలియకుము. అది లయశక్తిగకూడనున్నది. మూలప్రకృతి నుండి బయలు వెడలు యణువుల నొక కేంద్రము చుట్టు చేరులాగున యిచ్ఛాశక్తి

చేయుచున్నది. అప్పుడది సృష్టికారకుడైన బ్రహ్మ యొక్క పనిని జేసినట్లగును. కేంద్రముచుట్టు చేరిన యణువులు చెదిరి పోకుండ యుండులాగున యిచ్ఛాశక్తి వానిని దృఢముగా బట్టుకొను చున్నది. అప్పుడది విష్ణువుయొక్క పరిపాలనాశక్తిని బ్రయోగించిన ట్లగును. ఒకటిగా జేరియున్న యణువులను జెదిరించి వానిని మూల ప్రకృతిలో మరల గలుపుచున్నది. అప్పుడది శివుని లయకార్యమును జేసినట్లగును. అందుచే నిచ్ఛాశక్తికి సృష్టిస్థితిలయము లనెడి కార్యత్రయము ను జేయుత్రాణ యున్నది.

యువతి:—భూతవ్యక్తులను మనము స్వాధీనము జేసుకొనక పోయినయెడల నవి మనలను వశ పరుచుకొనుచున్నవి. వానిని మనము నిర్భయముగా నెదురుకొనిన యవి మనజోలికిరావు. మనసంకల్పముల వలననే యవి సృష్టియై యుండుటచేత మన సంకల్పముల వలననే నాశము కాగలవు.

భోజన కాలమున జరిగిన నీ ప్రస్తావము యోగము మొదలగు విషయములకు వెళ్లెను. యోగాభ్యాసము,

వస్తు శుద్ధీకరణము సులభముగను, కష్టముగను నున్నవి. జన్మమూర్ఖుడు తప్ప మనుష్యులందరు సామాన్యముగా వివేక యుక్తులై పుట్టుదురు. వివేకాతిశయముచే స్వభావ రహస్యములను దెలిసికొనుట కెవరు యత్నించెదరో వారికి పై జెప్పిన రెండువిద్యలు సులభముగా చేకూరును. ఆత్మ జ్ఞానమనెడి సూర్యప్రకాశమునకు బదులుగా వివేకశూన్యమైన విద్యాశిక్షచే లభించు కుతర్కము, అబద్ధ వాదము, ఊహాపోహలనెడి కొవ్వువత్తి దీపమును వెలిగించిన యెడల మనుష్యుడు స్వభావ సిద్ధమైన స్థితిని వదలి వేరువిధముగా బరిణమించుటలో సంశయమేమియున్నది? శాశ్వత ధర్మములు నిరపరాధస్థితియగు బాల్యమందే మనుష్యుల కంకితములైయున్నను వారికి వయస్సురాను రాను దురభిప్రాయములు, దురాక్షేపణలు దృఢతరములుగా బట్టుబడుచున్నవి కాన నా ధర్మములు తలక్రిందులుగా నర్థమగుచున్నవి. అసత్యములను సత్యములని భ్రాంతిజెంది తమ స్వంత ఊహాపోహలద్వారా వానిని జూచుచున్నారు.

పథికుడు :—వస్తుజ్ఞానమును గ్రంథముల మూలమున దప్ప మరి యేవిధముగా సంపాదించవచ్చును?

మహాపురుషుడు:—బిడ్డకు తనతల్లి పాలిండ్ల యుపయోగమునే యుపాధ్యాయుడు బోధించు చున్నాడు? ఈ మూలిక చేదు. ఇదిపథ్యకారియని పశువుల కేవృక్షశాస్త్రజ్ఞు డుపదేశించుచున్నాడు? శాస్త్రపద్ధతులు మానవులచే గల్పింపబడినవి కాన ప్రకృతి భండారమందు వానికి స్థానములే లేవు. వస్తువులకు మనుష్యులు పేర్లను గల్పించుచున్నారు. ఆపేర్లను బిడ్డల కభ్యాసము జేయించుచున్నారు. పేర్లు గుర్తైనప్పటికిని వస్తువులగుణములు వేరుకదా! గులాబీపుష్పమును వేరుపేరులో పిలిచినను దానిసువాసన యథాప్రకారముండును. ఇప్పటి విద్యాపద్ధతిలో స్వభావశాస్త్రజ్ఞులకు వస్తువుల పేర్లు, వానివిభాగములు బాగా తెలుసును కాని వానియాంతరంగిక గుణములేమియు దెలియవు. యోగజ్ఞుడైననో, సస్యములను జూచినమాత్రముననే వాని యథాషధగుణములను, స్వభావసిద్ధములైన యాంతరంగిక గుణములను గ్రహించగలడు. వస్తువులపై నంకితమైయున్న యానవాలు యోగజ్ఞులకుతప్ప శాస్త్రజ్ఞులకు తెలియదు.

పశువులు ప్రకృతిధర్మముల కనుగుణముగా వర్తించుచున్నవి. మానవుడైననో వానిని దిరస్కరించి నడచు

చున్నాడు కాన వానిని యస్వభావప్రాణి యని చెప్పవ
చ్చును. ఒకపులి తనవద్దకు వచ్చుచుండగా పారిపోవల
సినదని గొర్రెకు యే జీవశాస్త్రజ్ఞు డుపదేశించుచున్నా
డు? తన యంతఃస్వభావముచేతనే పులి తనకు శత్రువని
గొర్రె తెలిసికొనుచున్నది కదా! పులి యిట్టిజాతికిచేరి
నప్రాణి, దీనిరంగు యీలాగున్నది యను సంగతులను
బోధించుటకంటె నది భయంకరమైన ప్రాణియని గొర్రె
కు బోధించిన చాలదా? ఏదియో యొక యద్భుతశక్తిచే
గొర్రెకు మనుష్యునివలె జ్ఞానమున్నదని తెలియుదుము.
పులినిజూచిన వెంటనే యది క్రూరజంతువని భావించి
పరుగిడక, దాని దేహసౌష్ఠవమును, అవయవముల రచనా
విశేషములను, అది పుట్టినవిధమును నాలోచించుచు గొ
ర్రె నిలుచుండిన దానిని పులి తినివేయదా? ఇది యంత
గా ప్రశస్తమైన దృష్టాంతము గాకున్నను మీ విద్యా
శాలలలో జరుగుచుండు సంగతులను నిర్దేశించుటకు
తగిన యుపమానముగా నున్నది. తెలివి తేటలను సంపా
దించగోరు బాల బాలకులు మీ పాఠశాలలలో విద్య
నభ్యసించుచున్నారు. మనుష్యుని దేహమెట్టిది, దానికి
సుఖమునిచ్చు నాహారము లెట్లు దొరుకుచున్నవి. యను
సంగతులను మీ పాఠశాలలలో బోధించెదరు కాని దే

హము నాక్రమించియున్న జీవునివిషయమైగాని, వానికిఁ గావలసిన యుపపత్తుల విషయమునుగాని బోధించుట లేదు. ఆత్మను పస్తుపెట్టి, తృణీకరించి చివరకు చంపివేయుదురు. ఇంతకంటె నధికముగా నాత్మవస్తువు లేనేలేదని సాధించుచు మీశాస్త్రజ్ఞు లల్పమతులై యున్నారు.

పథికుడు:—పశువు స్వభావగుణముచే తెలిసికొను దానిని మనుష్యుడు బుద్ధి నుపయోగించి తెలిసికొనుచున్నాడు. అందుచేతనే ప్రాణులలోపల మనుష్యుడు శ్రేష్ఠుడనిపించుకొని యున్నాడుకదా!

మహాపురుషుడు:—యథార్థమేగాని మనుష్యుడు తన యనుభవమునకు విరుద్ధముగా బుద్ధి నుపయోగించరాదు. వాని యనుభవము, యుక్తియు నొకటిగా నుండవలెను. పశ్వాదులలో స్వభావ గుణమని (Instinct) పిలువబడు శక్తియే మనుష్యునియం దనుభవశక్తి (Intuition) గానున్నది. ఆత్మతత్వమీ యనుభవ శక్తిచేతనే గ్రహించ దగియున్నది. జీవుడనుభవశక్తిచేతను, బాహ్యేంద్రియ మూలముగను

దేనిని గ్రహించునో దానిని దేహాత్మ బుద్ధిచే దెలిసి కొనుచున్నాడు. అనుభవశక్తికనుగుణముగా బుద్ధి యుండిన, జనులందరు చతురులు, ప్రాజ్ఞులు కాగలరు. ఇప్పుడు లోకములో చతురులు ప్రాజ్ఞులు లేరు. విద్యావంతులు కుత్సితులుగాను, దుర్మార్గులుగాను లోకమందున్నారు.

పరమార్థశక్తి నపేక్షించువాడు ప్రకృతి కనుగుణముగ నుండవలెను. తనలోనుండు యస్వాభావిక గుణముల నన్నిటిని బోగొట్టు కొననియెడల పరమార్థశక్తి వానికి లభించదు. స్వాభావికుడు గాకమునుపు పారమార్థికుడైన నరు డాసురీస్వభావమును బొందును. అట్టియాసురీ ప్రకృతిగలవారు పూర్వమందుండిరి. ఇప్పుడున్నారు. వారిని మానుష శరీరములద్వారా పనిచేయు నధర్మశక్తులనిచెప్పవచ్చును. వామాచారులువారే. వారే మాంత్రికులు. వారే నానాతరగతులకు చేరిన దుర్మార్గులు.

పథికుడు:—మహాపాతకములను జేసినవారికికదా వామాచారులని పేరు?

మహాపురుషుడు:—అట్లు చెప్పనలవికాదు. అనేకులు తమ ప్రయోజనమునకై యకృత్యములను జేయుదురే గాని యకృత్యములపై ప్రీతిచేజేయరు. వామాచారులైననో చెరుపు చేయుట యందే ప్రీతిగలవారలై చెరుపునకుగానే చెరుపుజేసెదరు. నిజమైన భక్తులు లోకహితమునకుగానే హితము నాచరించులాగున వారు లోకమునకు చెరుపును గోరి చెరుపు జేసెదరు. మనుష్యుడేవృత్తి నభ్యసించిన నావృత్తియే స్వాభావికమగుచున్నది. హింసచేయుటలో తనకు సంతోషమగునని తెలిసి యొకయీగను జంపువాడు, తనప్రాణములను రక్షించుకొనవలెనను తలంపుచే పరుని జంపువానికంటె నెక్కువగా వామాచారమం దున్నాడని భావించవలెను.

పిదప దక్షిణాచార మార్గమును గురించి యనేక ప్రస్తావనలు నడచెను. మహాపురుషుడు తన హిమాచల యాత్రను వర్ణించెను. అదితప్ప యితరవిషయములన్నియు వాని స్మృతిపథమం దుండెను.

భోజనము ముగిసెను. తాను మరల వచ్చి వస్తుశుద్ధీ కరణాలయమునకు పిలుచుకొని పోయెదనని చెప్పి మహా పురుషుడు పథికుని నిద్దరు స్త్రీసాధువుల కొప్పగించి వెళ్లి పోయెను. పథికుడు తన యుభయ రక్షకులతో శృంగార వనమును ప్రవేశించెను.

చతుర్థాధ్యాయము సంపూర్ణము.

# సిద్ధాశ్రమము.

## పంచమాధ్యాయము.

---

### పూర్వజన్మస్మరణము.

శృంగారవనములో కరవీర పుష్పములుండు పొదల మధ్యమున స్త్రీసాధువులతో గూడ పథికుడు సంచరించుచు వర్తులాకారముగానున్న రంగమండపమును బ్రవేశించెను. ఆమండప మత్యున్నతమైన ప్రదేశముపై నిర్మింపబడియుండెను. ఆమండప మెత్తైన శిలాస్తంభములపై నిలిచియుండెను. వివిధ లతలచే నాస్తంభములు చుట్టబడియుండెను. ఆలతలు మొదట నూర్ధ్వముఖముగా బోయి మరల నధోముఖముగా దిగియుండెను. మండప మధ్యమున నిలిచి దిశలను జూడ దూరమందున్న యున్నతపర్వతము, దిగువనున్న భూతలము బహు రమ్యముగా గోచరించుచుండెను. ముగ్గురు వనవిహారులు మండపమందు కూర్చుండిరి. లీలాదేవియని పిలువబడు యువతీమణి పథికుని గూర్చి చెప్ప నారంభించెను:—

"స్త్రీలమైన మేమిద్దర మీయాశ్రమమం దుండుట కుగల కారణమును కొద్దిగా సూచించితిని గాని దానిని విస్తరించి చెప్పవలసిన కర్తవ్యము నాకింకను తప్పకయు న్నది. ఇచ్చట మాయునికి విషయమై నీయంతఃకరణ మున గోచరించిన సలహా బాగుగనేయున్నది. శక్తిదార్ఢ్య ములు పక్వముగాకమునుపు జీవన్ముక్తిదశకురాను వశము కాదనుమాట యథార్థమే. అవి పక్వముకావలసిన యెడల పురుషశరీర మావశ్యకము. స్త్రీశరీరముగుండా వానిని పక్వముజేయ నలవిగాదు. స్త్రీజన్మమందుండువా రొకవేళ జీవన్ముక్తస్థితికి సమీపమందున్నను పూర్ణఫల మును బొందునిమిత్తము వారు పురుషరూపమున మరల జన్మించవలెను. ఈనియమమున కపవాదము లేదని తెలి యకుము. మూలతత్వములలో స్త్రీపురుషశరీరములకు భేదములేదు. ప్రతి దేహమందును స్త్రీ పురుష భాగ ములున్నవి కాని స్త్రీశరీరమందు స్త్రీయంశము, పురుష శరీరమందు పురుషాంశము నధికముగానుండును. ఇది గాక, కొందరు స్త్రీలయందు పురుషస్వభావ మధికము గాను, కొందరు పురుషులయందు స్త్రీస్వభావ మెక్కువ గను నుండుటకలదు. పరిపూర్ణులలో చాలమట్టుకు స్త్రీపు రుషభాగములు సమముగా నుండును. ఒకవేళ పురుషాం

శము కొంచె మధికముగా నుండు నని చెప్పినను చెప్ప వచ్చును. సృష్టియందు పురుషాంశ ముత్పన్నశక్తిగాను స్త్రీయంశము పరిగ్రహాణశక్తిగాను పరిణమించియున్నవి. సృష్టిలోని సమ్మేళనాక్రమములను దెలిసికొనయత్నించి నపుడు నీకీరహస్యము తేటపడుచున్నది. ఈయొక్కసంగ తినిమాత్రము నీవు చక్కగా జ్ఞాపక ముంచుకొనుము. స్త్రీపురుషాంశము లొకదాని రెండుభాగములేగాని యొక టికి మరియొకటి భాగముకాదు. అనగా స్త్రీయంశమునకు పురుషాంశము భాగముకాదు; పురుషాంశమునకు స్త్రీ యంశముభాగముకాదు. అవి రెండుజేరి యొకటియగు చున్నది. పురుషాంశమందు శక్తిదార్ఢ్యము లధికముగాను స్త్రీయంశమందు సౌందర్యసౌకుమార్యత్వము లతిశయ ముగను నున్నవి.

జీవన్ముక్తస్థితియందున్న వ్యక్తి స్త్రీశరీరధారియై యుండినయెడల పూర్వజన్మమం దెద్దియో నొకవిలక్షణ సందర్భములను గలుగజేసికొని యాసంబంధమైన యను భవములను బొందునిమిత్తము పుట్టియుండవలె నని తెలి యుము. మనుష్యునిచే బోషింపబడిన సస్యము త్వరగా వృద్ధియగునట్లు స్వభావమునకు విడువబడినది వృద్ధికాజా

లదు. ఎక్కువకష్టముల ననుభవించిన మనుష్యుని యందు వికసించు నంతటి త్వరగా కష్టములకు గురికాని నరునిలో పరమార్థము వికసించదు.

ఈమాటలచే పథికుడు విస్మితుడాయెను. జీవన్ముక్త దశకు రాకమునుపు లీలాదేవి యనుభవించిన జన్మ వృత్తాంతములను విన గుతూహలుడయ్యెను.

లీలా.—కొన్నిసందర్భములలో పూర్వజన్మవృత్తాంతములను స్మరించుకొనుటచే దుఃఖము కలుగుచున్నది. మనసోదరియగు "తారా" తనజన్మాంతరవృత్తాంతమును జెప్పిన మనము వినవచ్చును.

తారా.—మనయాగంతుకసోదరుని సంతోషముకొరకు నాజన్మాంతరవృత్తాంతమును జెప్ప నభ్యంతరములేదు కాని యది నీజన్మవృత్తాంత మంత స్వారస్యముగానుండదు. మొదట నీసంగతినానతిమ్ము. తరువాత నాచరిత్రను వివరించెద.

లీలా.—ఆలాగేకానిమ్ము. నాచరిత్రను సాంగముగా వివరించవలెనన్న చాలకాలము పట్టును. కాన గాలవిష

యముల,నవలంబించక సూక్ష్మాకాశమందంకితమైయు
న్న నావృత్తాంతమును జూపించెద. ఓయిసోదరుడా!
నీయెదుటనుండు బల్లపైదయచేసి నీదృష్టిని కొంత
కాలము స్థిరముగా నిలుపుము.

ఆమండపముయొక్క మధ్యభాగమం దొకబల్ల
యుండెను. దానిపైభాగమందు పథికుడు తనదృష్టినినిలిపి
యేకాగ్రచిత్తముగలవాడై యుండెను. కొంతకాలమైన
పిదప యుద్ధరంగమును సూచించు నొకచిత్రపటముగోచ
రించెను. ఆయుద్ధరంగమందు వామభాగమున నొక
సైన్యము దక్షిణభాగమున నొకదళము నిలిచియుండెను.
సైనికులలో కొందరు ఖడ్గములను, కొందరు భల్లములను
ధరించియుండిరి. అశ్వారోహకులు కొందరు, పదాతులు
కొందరాసైన్యములయందుండిరి. అభేద్యములైన కవచ
ములను ధరించుకొని రణోన్మత్తులై జయమునుగోరి ఘోర
మైనసంగ్రామము నారంభించిరి. కొంతకాలములోనే
గాయములను పొందినవారు కొందరు, దేహమును విడి
చినవారు కొందరు భూతలమున శయనించిరి. మృతులకు
దీర్ఘనిద్ర ఘటించెను. గాయముతిన్నవారు యాతనాతి
శయముచే హాహాకారము జేయుచుండిరి. వామభాగమున

నున్న దళము విజయచిహ్నములనుజూపించెను. సైనికులు పరుగిడ నారంభించిరి. దక్షిణదళము వారిని నిపాతముజేయదలచి వెంటనంటెను. కోలాహలమధికమాయెను. పరుగిడుచున్న యోధులను వెనుకకుమరలించుచు సైనికవేషముతో నున్న సుందరగాత్రియైన యబలామణి యొకతె వామదళమునుండి బయలుదేరెను. ఆవీర రమణియొక్క హావ భావములు లీలాదేవియొక్క హావభావములవలె గోచరించెను. ఆమె దర్శనమైన వెంటనే వామదళమున కన్యాదృశమైన పరాక్రమముపుట్టెను. రణమత్తులవలె మరల పోరై తమశతృవులపై బడ నారంభించిరి. జయమును నిశ్చయించుకొనియున్న దక్షిణదళము ఛిన్నభిన్నమై పరుగిడ నారంభించెను. అందలి సైనికులహృదయములు బ్రద్దలై వారు తుద కపజయమునుబొందిరి. వామదళమునకు జయముకలిగెను. జయభేరులు మ్రోగెను. చిత్ర మదృశ్యమాయెను.

మరికొన్ని నిమిషములకు వేరొక చిత్రము గోచరించెను. గొప్ప దేవాలయము. దానిలో మతాధికారులు, రాజ్యాధికారులు, సైన్యాధికారులు, పౌరశ్రేష్ఠులు సమావేశమైయుండిరి. కవచధారియగు నొక వీరపురు

షుడు శిరమునువంచుకొని వేదికకెదుట మోకరించుకొని యుండెను. మతసంబంధమైన బిరుదులతోగూడుకొనియున్న మహాపురుషుడొకడు వానితలపై స్వర్ణమయకిరీటమును బెట్టుచుండెను. వానిపార్శ్వమున ధ్వజపతాకమును గైకొని విజయప్రమోదమును జూపించుచు లీలాదేవి యుండెను. మంగళవాద్యములు మోగుచుండెను. కిరీటము తలపై నుంచబడగానే ఆయధినాయకుడు పైకిలేచెను. సభికులందరు నిలుచుండిరి. వేయారునోళ్ల సంతోషధ్వనులు బయలువెడలెను. చిత్ర మదృశ్యమాయెను.

మరికొన్ని నిమిషములైన పిదప మూడవ చిత్రము గోచరించెను. చీకటిగది, దానిలో బలువిధములైన హింసోపకరణములుండెను. నల్లనియుడుపులను ధరించుకొని నేత్రములనుండి ద్వేషాగ్నిని కురిపించుచున్న కొందరు ఘాతకులుండిరి. రక్తవస్త్రములను ధరించి వధజేయ సిద్ధముగానున్న మరి కొందరు పాతకులుండిరి. హస్తములో దివిటీలను బట్టుకొని మరికొందరు నిలిచియుండిరి. వారిమధ్యమున హస్తపాదములకు సంకెళ్లువేయబడిన లీలాదేవియుండెను. నల్లనియుడుపువారిని జూచి కనికర తృణీకరణ భావముల నామె చూపెను. వారేమేమో

హీనములగు ప్రశ్నలను జేసిరిగాని లీలాదేవి వానికుత్తర
ము లివ్వలేదు. చిత్రవిచిత్రములుగా నామెను వారు హింస
జేసిరి. ఘోరతమములైన యాహింసలను జూడజాలక పథి
కుడు తనదృష్టిని వెనుకకు మరలించెను. చిత్రపటమదృశ్య
మాయెను.

పథికుడు మరల తన దృష్టి నేకాగ్రముగా నిలి
పెను. అంతట నొక చిత్రము గోచరించెను. పేర్చ
బడిన కొయ్యలరాసి. దాని మధ్యమున దృఢమైన
యొక స్తంభము. దానికొక సంకిలి. ఆ ప్రదేశము
చుట్టు జనసముదాయము. దూరములో నొక యూరే
గింపు. ఆ గుంపులో దుష్టాత్ములగు కొందరు సన్యాసులు,
సైనికులు. మధ్యభాగమున లీలాదేవి. ఆ యూరేగింపు
కొయ్యలరాసివద్దకు రానురాను జననికరము పెచురుచుం
డెను. లీలాదేవి బద్ధహస్తముగలదై యుండెను. ఆమె
మెడచుట్టు నొక త్రాడుండెను. హింసనుండి కలిగిన
యాతనచే నామెముఖము పలచనై తెల్లబారియుండెను.
కొయ్యలరాసివద్దకురాగానే దానినెక్కెను. స్తంభమున
కామెనుగట్టిరి. ఎద్దియోనొక సంగతిని జెప్పవలెనని యా
మె యత్నించెనుగాని దీర్ఘాలోచనలోనున్న దుష్టసన్యా

సులు నిరోధించుచు నామె ముఖముపై నీళ్లను జల్లుచుం డిరి. ఒక పాతకుడు దివిటీనిదెచ్చి యా కొయ్యలరాసికి మంటబెట్టెను. అగ్ని యగాధముగా ప్రజ్వలించెను. ఆవీర రమణియొక్క సుందరగాత్రము యజ్ఞేశ్వరుని కాహుతియాయెను. చూడజాలక పథికుడు కండ్లను మూసుకొనెను. వాని హృదయమునుండి దుఃఖాగ్ని బయలువెడలెను. చిత్రపట మదృశ్య మైనను యా దుఃఖాగ్ని శమించలేదు.

చాలసేపు పథికుడు నిశ్చేష్టితుడై యుండెను. స్మృతి కలిగిన పిదప లీలాదేవిని మరల మరల జూచుచు నామె యొక్క నీతిసాహసములను శ్లాఘించెను. దేశచరిత్రలో నామె సంగతిని జదివియుండెను కాని యామె చిత్రపట మునుజూడ నాశించుచుండెను. నవయావనసంపన్నయై, దృఢాంగియై, గంభీరభావముగలదై, సుందరముఖియై వర్ధిల్లుచున్న యాయైతిహాసికవ్యక్తిని తాను కన్నులారజూచి నందుకు విస్మయానందభరితుడాయెను. చరిత్రకాలమును గణించగా నామె వయస్సప్పటికి 450 సంవత్సరములని తోచెను.

ముక్తుల సన్నిధిలో మానవుల తలంపులు గోప్యములు కానేరవు కాన వాని గణితమును కనుగొని లీలాదేవి చెప్పసాగెను.

లీలా.—నీవు నిష్కర్ష జేసినదానికంటె నధిక వయస్సుగలదాననైయున్నాను. నీవును, నేనును, మరియు నితరులును సృష్టియొక్కయాదినుండియు నున్నాము. పూర్వమున ప్రళయమైన పిదప యీశ్వరుడు పునస్సృష్టి కారంభము చేసి తనలోనుండి దివ్యతేజమును వెడలించి నప్పుడు సహితము మనముంటిమి. ఈశ్వరునియా దివ్యతేజము మరల తనస్థానమునకు బోవువరకు మనముందుము. మనయాత్మకు వయఃపరిమితిలేదు. ఆత్మ శాశ్వతమైనది, కాలమున కతీతమైనది, దానికి వాసస్థానముగా నుండు పారమార్థిక కోశ మగ్నిచే దహించబడునది కాదు.

పథికుడు.—మీ దేహమగ్నిచే దహింపబడలేదా?

లీలా.—కేవలము హీనభాగముయొక్క పదార్థముచే నిర్మింపబడియుండిన నాపార్థివదేహము దగ్ధమై పోయి

నది నిజమే కాని నాపారమార్థిక దేహము భస్మము కాలేదు. పార్థివశరీరము కాలి పోయిన వెంటనే నాయతివాహిక దేహము ధూమమునుండి పైకిలేచెను. స్థూలైకదృష్టిగల వారలకు నా యతివాహిక దేహము గోచరించలేదు. ఆస్థలమున కేతెంచియుండిన నారక్షకులగు మహాత్ము లతివాహిక దేహముల యందుండిరికాన వారికి నాయతివాహిక దేహము గోచరించుచుండెను. పార్థివ దేహము దగ్ధముకాగానే నాకు కొంతకాలము విస్మృతికలిగెను. పిమ్మట నతివాహిక దేహమందు జాగ్రతను పొంది నే నభ్యాసబలముచే దానిని స్థూలదేహమువలె ఘనీభవించునట్లు చేసుకొంటిని. ఈకారణముచేతనే నేను నీకు పార్థివ శరీరధారివలె స్థూలముగా గోచరించుచున్నాను.

పథికుడు.—పార్థివశరీరము పడిపోయినపిదప కామదేహమును దానివలె ఘనీభవించునట్లు చేయగల్గిన, మృతులను మరల కనుబడులాగున చేయవచ్చునుకదా?

లీలా.—చేయవచ్చును. వామమార్గమందు వర్తించు మాంత్రికు లట్లు చేయుచున్నారు. అకస్మికముగ

నకాలమరణమొందినవారు, లేక ద్వేషులచే జంపబడిన వారు భూమికి బద్ధులై యుండుటకలదు. అట్టివారి కామశరీరములకు సంబంధించిన యణువులకు పరస్పరాకర్షణశక్తి పోయియుండదు కాన నాశరీరములను స్థూలముగా గోచరించునట్లు చేయవచ్చును. చాలకాలముక్రింద మృతినొందిన వారి కామ దేహములు క్షీణము లై యుండుటవలన వానిని పార్థివరూపములుగా గోచరించునట్లు చేయనలవికాదు. స్థూలములుగా ఘనీభవించిన కామశరీరములకు ప్రత్యేకముగా ప్రాణముండుటలేదు కాన నవి దీర్ఘకాలము జీవించి యుండజాలవు. మాంత్రికు డట్టి దేహములకు తనప్రాణశక్తినో లేక తన వశవర్తియైయున్న జీవుని (Medium) ప్రాణశక్తినో యిచ్చుచున్నాడు. ఆశక్తి యెంతకాలముండునో యంతవరకా దేహములు జీవించియుండును. పార్థివదేహము చనిపోయినను కామశరీరము జీవించియుండవలెనన్న, మనుష్యుడు బ్రతికియుండగానే యాకామదేహమున కావశ్యకమైన చైతన్యము నివ్వవలెను.

పథికుడు.—స్థూలదేహమందుండు ప్రతి కామశరీరము సజీవముగా నుండునని తోచుచున్నది.

లీలా.—నిశ్చయమేకాని ప్రతి కామశరీరము ప్రాణప్రజ్ఞలకు స్థానముగానుండునని చెప్పనలవికాదు. జనసామాన్యులకు ప్రాణము పార్థివదేహముయొక్క రక్తమందుండును. రక్తప్రవాహము నిలువగానే ప్రాణము కామదేహమునకు వెళ్లుచున్నది కాన కామదేహమప్పుడు చైతన్యయుక్తమగును. అతి వాహిక దేహగతుడైన మహాత్ముని కాత్మయందే ప్రాణప్రజ్ఞలు ప్రతిష్ఠింపబడియుండును గనుక నతడు స్థూలదేహమందు లేకున్నను స్వప్రజ్ఞచే స్వతంత్రపురుషుడై యుండును. నేను వెనుక జన్మములలోనే ప్రాణప్రజ్ఞల నాత్మలో బ్రతిష్ఠించుకొని యుంటిని. కృషికుని కుటీరమందు బుట్టుటకు మునుపే జీవన్ముక్తిమార్గమును బ్రవేశించియుంటిని. నాబాల్యదశలో మహాత్ములతో నాకు సంబంధముండెనుకాని నాస్థూలప్రజ్ఞకు వారు గోచరించుచుండలేదు. ఏలయన, నాయాత్మకు గోచరించుదానిని పరిగ్రహించుశక్తి నాపార్థివదేహముయొక్క మెదడుకు వచ్చియుండలేదు. ఇకముందు గహన

ములైన సంగతులను జెప్పి నీకాయాసమును గలుగ జేయ నిష్టములేదు కాన నింతటితో విరమించెద. ప్రతి నియమమునకును వినాయింపుకలదు కాన ప్రకృతి ధర్మము లనంతరూపములై పరిణమించుచున్నవి.

పథికుడు.—ఇంత యమోఘములైనసంగతులను బోధించినందుకై నేను చాల కృతజ్ఞుడనై యున్నాను. మరి యొకప్రార్థనయున్నది. దానినీడేర్పగోరెద. యుద్ధకాలమందు మీరు వింతలైన శబ్దములను విని యొక వ్యక్తిని జూచితిరిగదా? అవిఏమి? దేవదూతయొక్క సహాయమువలన మీకు జయమాయెనని తలచవచ్చునా?

లీలా.—కాదు. మర్త్యలోక వ్యవహారములలో దేవతావ్యక్తులు ప్రవేశించుటలేదు. ఆత్మ సాక్షాత్కారమును బొందిన పారమార్థికు డావ్యక్తులకంటె నెంతయో నధికుడు. ఈ యాశ్రమ సోదరులలో నొకడు పూర్వమందు దేశభక్తుడై రణధీరుడుగా నుండెను. అతనిశక్తి నాయందు బ్రవేశించి సైనికవేషమును ధరించెను. దేవదూతలయందు నాకు పూర్ణప్రేమ

యుండినందున నామహానీయు డట్టిరూపముతో నాకు గోచరించెను. ఇదిగో చూడుము.

ఇట్లుపలికి లీలాదేవి యా యోధునిరూపమును ప్రదర్శించెను. సూర్యప్రభకు సమానమైన ప్రకాశముగల కవచముతో దేదీప్యమానమై యుండెను. పథికుని నేత్రములా తేజమును భరించకపోయెను. అవి గుడ్డివగునే మో యను భీతిచే వానిని మూసుకొనెను. కొన్ని నిమిషములలోపల నారూప మదృశ్యమాయెను. లీలాదేవి మునుపటియట్లు గోచరించెను.

పథికునిదృష్టి మరియొక స్త్రీసాధువుపై పారెను. ఆమెయొక్క హావభావములను జూచెను. మునుపెచ్చటనో చూచియున్నట్లు వానికి స్ఫురించెను. స్వప్నములో జూచి యుండవచ్చునా? కాదు! బాల్యమం దొకరోజు నిద్రాజాగరముల మధ్య తాను ప్రజ్ఞావంతుడై యుండ సర్వథా వశ్యమైన అమానుషవ్యక్తి యొకటి చేతిలో గుముదపుష్పమును బట్టుకొని గగనమందు తనయూర్ధ్వభాగమున నర్తనముజేయుచు దనకాపుష్పమును జూపుచుండెను. ఆ సుందరవిగ్రహామును మరియొకతూరి దర్శింప పథికు

డెన్నిమారులో కుతూహలముండెను కాని యది లభించ లేదు. ఈ స్త్రీరత్న మావ్యక్తిగా నుండవచ్చునా?

చూచుటకా యబలామణి బహుసుందర గాత్రియై యుండెను. పొడుగైన నల్లని కేశపాశము లుండెను. శుభ్రమైన తెల్లని నిలువుటంగీని ధరించి యుండెను. తేలికయైన తెల్లని దేహ వర్ణముండెను. నల్లని యామె నేత్రముల దృష్టి పథికుని యాత్మస్థానము వరకు జొచ్చి యుండులాగున తోచెను. ఆదృష్టిచే పథికునియందు పారమార్థికప్రీతియు, శ్లాఘనాశక్తియు నతిశయమగు చుండెను.

తారా.—నాజీవచరిత్రమంత గణ్యముగాలేదు. నాజన్మస్థానము పితృపురము. నాతండ్రి సార్వభౌముని సేనలో నొకయధికారిగా నుండెను. నాబాల్యముననే యతడు గతించినందున మాకుటుంబము చాల దరిద్రదశకు వచ్చెను. తల్లియు, బంధువులు, నుపాధ్యాయుడును తప్ప యిహమందు నాకేఋణానుబంధ ముండలేదు. నామనస్సు వికసించి యాముష్మిక సుఖములయందా సక్తమై యుండెను. దారిద్ర్యమును నేను ప్రేమించు

చుంటిని. ఆకాశమందు మేఘములు సంచరించు క్రమమును, వానిలో గోచరించు మనోహర మైన వస్తు రూపములను జూచి సంతోషించు చుంటిని. నాయాత్మ ద్వారా పూర్వ మందున్న ధీర పురుషులతో సంభాషించుచుంటిని. నా మనోవికాసమున కనుగుణముగా నా దేహముండ లేదు. చలియు, నుపవాసమును, దారిద్ర్యము నా దేహపాతమును త్వరజేసెను. పాడైన నా క్షయశరీరమును 18 వత్సరముల వయస్సులో నేను విడిచిపెట్టితిని. ఇచ్చటికి సోదరమహాశయులు కరుణతో నన్ను పిలుచుకొనిరి.

సుస్పష్టములైన యీవినయవాక్కులను విని పథికుని యంతఃకరణములో కనికరము పుట్టెను. "మీయద్భుతశక్తిని గనిపెట్టి మీకు సహాయము జేయునంతటి బుద్ధిశాలు రాప్రాంతమం దుండలేదా?" అని యడిగెను.

తా రా.—నా దేహపాతానంతరము నాజ్ఞాపకార్థమై విశేషద్రవ్యమును సెలవుజేసి యొక "జ్ఞాపకమందిరమును" నిర్మించిరి. దానికై వ్రయమైన ద్రవ్యములో కొంతభాగమును మాత్రమే నేను బ్రతికియుండినపుడు

నాకిచ్చియుండిన నేనింకను జీవించియుండుటకు తగిన యుపపత్తులను సంపాదించికొని యుందును. నేను బ్రతికియుండు కాలమున నన్నెరిగినవారు, నాకవితాశక్తిని,బుద్ధికౌశల్యములను చాల పొగడుచుండిరికాని వారుకూడ నావలె దరిద్రులుగా నుండిరి. అది యట్లుండనిమ్ము. మనుష్యులకు సంప్రాప్తములగు సందర్భములు వారివారికర్మ ననుసరించి యుండును. నాదారిద్ర్యము, నాకష్టములు నాకు లాభకరములుగానే యుండెను. పురాకృతకర్మచే లభించిన దానితో తృప్తి జెందియుండుటకు నాకు తగిన కారణ ముండెను.

తారాదేవి పైవాక్యములను బలుకుచుండగా పథికుడామె ముఖమునే పరీక్షించు చుండెను. "బహుసంవత్సరములక్రిందట నాస్వప్నమందు గోచరించిన వ్యక్తి యీయామేయని చెప్పవచ్చునా? నాకాశీర్వాదముజేసినట్లు కుముదపుష్పమును ద్రిప్పిన దేవతావ్యక్తి యీయామెగా నుండవచ్చునా? నాయుత్తమస్వభావమునకు చైతన్యము నిచ్చులాగున కుముదపుష్పసంకేతమును నాహృదయమందు బ్రతిష్టించిన మహానుభావురాలీమెయైయుండవచ్చునా? స్వప్నమందుగోచరించిన యావృత్తాంతము నిజమేనా?

స్వప్న మబద్ధమైనయెడల నే నాకాలమున నాసుఖము ననుభవించలేదా? వేయారు స్వప్నములను మరచిన, నీ స్వప్నమును మాత్రము నేనెందుకు మరువలేదు?" అను నీ యాలోచనలు పథికుని మనస్సులో ప్రసక్తములయ్యెను.

తారాదేవి తన యాసనమునుండి చివ్వునలేచి స్తంభముల మధ్యభాగమునకువెళ్లి గోడపై కనుపించు చున్న యొకలతనుండి కుముదపుష్పమును గోసి దానిని పథికుని హస్తమందుంచి యిట్లుపలికెను :—

"ఈపుష్పరాజమును నీయొద్దనుంచుకొనుము. స్వప్నమువలె నిది వాడిపోనేరదు. దీనిని జూచినప్పుడెల్ల నేను కల్పలతవ్యక్తికాదని నీకు తెలియును."

పథికు డా పుష్పమును బుచ్చుకొని తారాదేవి కభివందనముజేసి యెప్పటివలె తన్ను గాపాడవలెనని వేడుకొనెను.

తారాదేవి.—తమ్ము దామే యుద్ధరించుకొనుట కెవరు యత్నించెదరో వారిని మేము కాపాడుచున్నాము.

మాశక్తిని బరిగ్రహించుటకెవరు సిద్ధముగానుందురో వారికి మే మాశక్తిని దానము జేసెదము. పారమార్థికమార్గముగుండ నెవరు మమ్ములను సమీపించెదరో వారిని మేము పొందెదము. ప్రీతివలన పరస్పరాకర్షణ తటస్థమగుచున్నది. పరిగ్రహణశక్తి సిద్ధమైనపుడు దానశక్తియు సిద్ధమైయుండును. సూర్యుని తేజమును సర్వు లనుభవించవచ్చునుకదా! దానినందరు చూడగలరా! సత్యమనునీటిబుగ్గ యెప్పటికి నెండదు. అది సర్వత్ర సిద్ధముగానున్నదికాని దానిని బరిగ్రహించుటకు తమహృదయములను దెరచుకొనియుండువారుమాత్రము చాలయరుదు. స్వార్థక్షేత్రమునుండి పైకిలేవ నీవు సదా యత్నించుచుంటివేని హీనభూతములను నిపాతముజేసి యాత్మయందే యవిచ్ఛిన్నముగానుండు మహాత్ముల సంగము నీకు లభించును.

ఈ మాటలను ముగించుచుండగా మరియొక సాధుపురుషుడా రంగమండపమును బ్రవేశించెను. ఆకారమందు పొట్టిగానున్నను ముఖములో బుద్ధి కౌశల్యము తేజరిల్లుచుండెను. గురువర్గమునకు జేరినవ్యక్తిగానుండ

వచ్చునని పథికునికి స్ఫురించెను. అతనికి శిరోజములులేవు. శిరస్సుయొక్క యాకారము వింతగనుండెను. శిరముయొక్కయిరుపార్శ్వములలో దెల్లని కేశఖండములు వ్రేలాడుచుండెను. అతని రూపచిత్రములు పథికుడదివరకే చూచియుండెను. అతని సాన్నిధ్యము నప్పుడప్పు డనుభవించియుండెను. ఆమహనీయుని పేరు " తారకసాధువు" అతడు వైద్యుడై యుండి యనేకరోగముల నద్భుతచికిత్సలచే నివారించియుండెను.

తారకసాధువు.—"శాసనకర్త" మర్త్యలోకముయొక్క రాజకీయ విషయములకు సంబంధించిన యొకమహాత్కార్యమును గూర్చి వెళ్లియున్నాడు. రాజతంత్రజ్ఞు డొక డవివేకమైన యొకకార్యమును జేయదలచినాడు. దానివలన ఘోరమైన సంగ్రామమే తటస్థించును కాన వాని దురాలోచనను నిరోధించి మరియొక మంచియాలోచన నిచ్చుటకొరకా మహాపురుషుడు వెళ్లియున్నాడు. మన యీయతిథిసోదరునకు వస్తుశుద్ధీకరణాలయమును జూపించి దురభిప్రాయములను బోగొట్ట నన్ను నియమించియున్నాడు.

స్త్రీసాధువులను వదలిపోవ పథికున కిష్టముండ లేదు. వారివద్దనుండు నిమిత్తము తనప్రాణములనైన నర్పించుటకు సిద్ధముగా నుండెను. కాని తారకసాధువు కరుణించిన యవకాశమును దిరస్కరించుట యనీతిరాయో యుండెను. స్త్రీసాధువులిద్దరు సెలవిచ్చినందున పథికుడు తారకసాధువును వెంబడించి వెళ్ళిపోయెను.

పంచమాధ్యాయము సంపూర్ణము.

# సిద్ధాశ్రమము.

## షష్ఠాధ్యాయము.

---

### వస్తుశుద్ధీకరణాలయము.

తారకసాధువు రమణీయమగు మరియొకమందిరమునకు పథికుని గొనిపోయెను. దానిలో స్త్రీపురుష దేవతులయొక్కయు ప్రాచీన శూరులయొక్కయు శిలాప్రతిమలు స్థాపింపబడియుండెను. వానిం బథికునకు జూపించుచు జెప్పసాగెను.

తారకసాధువు.—సృష్టియందు భూతతత్వములు, వానినధిష్ఠానము జేసికొని దైవశక్తులు సదాపని జేయుచున్నవని నీవు వినియుండవచ్చును. ఈ శిలాప్రతిమలు వానిని సూచించునిమిత్తమిచ్చట స్థాపింపబడియున్నవి. తత్వములకును, శక్తులకును గుణధర్మములు భిన్నములైయుండుటచేత నీశిలామూర్తులకు సహితము భిన్నచిహ్నములు కల్పింపఁబడియున్నవి. మానవహృదయము మూర్తులనుగ్రహించునంత త్వరగా

నిరాకారము లనుగ్రహింపజాలదు కాన సమస్తమత ములలోను స్వభావశక్తులకు స్త్రీపురుష దేవతలను సాంకేతికముగా నామరూపములను గల్పించియున్నారు. మనుష్యుని నామరూపములవలె యవి గుణధర్మ ములను నిరూపించుచున్నను, కల్పితములైనవే కాని వాస్తవికములు కావు. మన పూర్వులీ రహస్యమును జక్కగా నెరిగి యుండిరి. ఇప్పటి విచక్షణు లంతదూరము రహస్యమును శోధించక బాహ్యరూపములనే యాంతరంగికసత్యములుగా బరిగ్రహించి భ్రాంతులగుచున్నారు. స్థూలైకదృష్టిగల మత ములయం దఖండవస్తువు ఖండమూర్తిగను, ప్రకృతి యందున్న శక్తివిశేషములు దేవతలుగను కల్పింప బడియున్నవి.

ఇట్లు ముచ్చటించుచు నా తారకసాధువు గుండ్ర ముగా నున్న యొక పడసాలకు పథికుని బిలుచుకొనిపో యెను. అది యొక దేవాలయమువలె నగపడుచుండెను. దానికి కిటికీలు లేవు. మిద్దెకుమారుగా నద్దముతో నిర్మింప బడిన గుమ్మటముండెను. దానిద్వారా నామందిరమునకు వెలుగువచ్చుచుండెను. ఆగుమ్మటముక్రింద భూమికి

కొంతయెత్తులో స్వర్ణఖచితములైన త్రికోణములురెండు ఒకటితోనొకటి జేరియుండెను. షట్కోణాకృతిగా నేర్పడియున్న యాత్రికోణద్వయముచుట్టును తోకను జుట్టికొని స్వర్ణమయసర్పమొకటి వ్రేలాడుచుండెను. మందిరము యొక్కగోడల్లో వరుసగా నలమారు లుండెను. వానిపై రసాయన శాస్త్రిగ్రంథములు వరుసగా నుంచబడియుండెను. ఒకగోడయొక్క ముందరిభాగమున దానినానుకొని యున్నతమైన యొక వేదికయుండెను. దానిపై నొకదీపము వెలుగుచుండెను. రెండు మూసలు పార్శ్వమున నొకబల్లపై కొన్ని సీసాలు, కొన్ని కుర్చీలు తప్ప మరియేయుపకరణము లామందిరమందు లేవు.

రసాయన గ్రంథములయందు నిర్దేశింప బడిన పొయ్యిలుగాని,గొట్టములు మొదలగు పరికరములుగాని అచ్చట లేకుండుటను జూచి పథికుడు విస్మితుడాయెను. దానింగని తారకసాధువు చెప్ప నారంభించెను.

తారకసాధువు.—ఇచ్చట వైద్యుని వివిధోప కరణములుండునని నీవు తలచియుంటివా? సీసాలు, గొట్టములు, యంత్రపు పొయ్యిలు, జలశోధనాయంత్ర

ములు, ఆవిరియంత్రములు, స్వార్థపరులైన దుష్టు లను భ్రాంతిగొలిపి ప్రకృతి రహస్యముల జోలికి పోకయుండు లాగున జేయుటకై కల్పింపబడిన సామ గ్రులని తెలియుము. నిజమైన రసాయనశాస్త్రజ్ఞునకు నంగడిలో గొనవలసిన సాధన సామగ్రులేలేవు. ఆవ శ్యకములైన యుపకరణములు వాని దేహమునందే దొర కుచున్నవి. పరమరసాయనమందు మానవహస్తము లతో జేయవలసిన కార్యమేమియు లేదు. ఆత్మను మరుగుజేయుమాలిన్యమును బోగొట్టి పశుభావమం దున్న మనుజుని దేవభావమునకు దెచ్చుటయే నిజ మైన రాసాయనిక సంస్కారము.

పథికుడు.—ప్రాచీన రసాయనశాస్త్రజ్ఞులు హీనలోహ ముల నుత్తమలోహములుగా మార్చుచుండలేదా?

తారకసాధువు.—మానవులస్వాభావముగానేర్పడియున్న యదృశ్యభూతములు రక్తమాంసాదులకంటె నెక్కు వకాలముండును కాన వానికి లోహములను సంజ్ఞ యున్నది. అవి వారి యాలోచనలవలనను, ఆశలవల నను పుట్టుచున్నవి. ప్రప్రథమమున నవి మనుష్యుల

పశుస్వభావమందు బ్రతిష్ఠింపబడి యుండుటచేత హీన లోహములని పిలువబడుచున్నవి. దురాలోచనలను మంచియాలోచనలుగను,దురాశలను మంచియాశలుగను మార్చుడమే నిజమైన లోహసంస్కారక్రియగా నున్నది. హీనలోహములు శుద్ధియగునపుడు వివిధములగు వన్నెల నవి ప్రదర్శించుట సహజధర్మముగా నున్నది. నరుల కామశరీరముల యందుండు హీన భూతములు సంపూర్ణముగా భస్మీభూతములై పోవు. పరకాత్మ తేజము వారి శరీరములయందు ప్రకాశింప జాలదు. అవి భస్మమైనవెంటనే యంతరాత్మ తన శక్తులను బ్రకాశింపజేయును.

పథికుడు.—అట్లైన, రసాయన గ్రంథముల యందు వ్రాయబడిన ప్రయోగములు సాంకేతికములా? లవణము, గంధకము, రసము మొదలగు పేర్లు సాంకేతిక నామములా?

తారకసాధువు.—సృష్టిలో విధి భేదములను గల్పించికొని లోకములను బరస్పరము ప్రత్యేకించుటకు సాధ్యముకాదు. ఏలయన, సృష్టినియమములు సార్వ

త్రికములై యున్నవి. అవి పనిచేయని లోకములేదు కాని యొక్కొకలోకమం దొక్కొకవిధముగా నవి పరిణమించుచున్నవి. పారమార్థిక లోకమందు తటస్థములగు కార్యములే కామలోకమందును, స్థూల లోకమందును తటస్థమగుచున్నవి కాని యాయాలోకముల స్థితి వ్యత్యాసమునుబట్టి యాకార్యములు కూడ రూపవ్యత్యాసములను బొందుచున్నవి. ప్రకృతి పరస్పరము సంబంధములేని వస్తువులతోను, భూతసముదాయములతోను గూడియున్నదని మీా భౌతిక శాస్త్రజ్ఞులు తలచెదరు. ఇది పక్వమైన యభిప్రాయముకాదు. వస్తుతః ప్రకృతి యేకమైనది. దానియందున్న దంతయు పరస్పరము సంబంధించి యుండుటయేగాక యొకదాని వ్యాపారము మరియొకదానికి వ్యాపించుచున్నది. ప్రాచీన రసాయనశాస్త్రజ్ఞుల కీసంగతి స్పష్టముగా దెలిసియుండెను. ఆధునికులు సహిత మీాసంగతిని గ్రహించిన మేలు. ఒక గ్రంథమందీలాగున వ్రాయబడియున్నది:—"భూలోకముననున్న దంతయు నూర్ధ్వలోకములలో (అంతరంగికప్రపంచములలో) సూక్ష్మరూపములతో నున్నది. ఎంతస్వల్పమైనదిగా నుండినను యీాలోకమందు

వ్యక్తమైనదంతయు పైలోకములయందు తప్పకయు న్నది. భూలోకమందు కార్యములు గోచరించుచున్న వి. ఊర్ధ్వలోకములయందు కారణములు కనపడుచు న్నవి. ఇది స్వభావసిద్ధము. ఇదిగాక, ప్రతికార్యము ఫలప్రదమైయున్నది.

పథికుడు.—బాహ్యప్రపంచమువలె మానవుడొక చిన్న ప్రపంచమని పెద్దలవలన నేను వినియుంటిని.

తారకసాధువు.— అదినిజమేకాని దానిని పట్టిసిద్ధాంత వాక్యముగా భావించుటచే ప్రయోజనములేదు. స్వా నుభవమునకు దెచ్చుకొనవలయును. సమస్తశక్తుల తోను, స్వర్గనరకములతోను, దేవాసురులతోను, లోకాంతరవాసులతోను నిండియున్న జగము నీయం దేయున్నది. నీకిచ్ఛకలిగినపుడు నీ వాప్రపంచమును చైతన్యయుక్తముగా జేయవచ్చును. నీజగమునకునీవే యీశ్వరడవు. నీవే సృష్టికర్తవు. అవిచ్ఛిన్నములైన నీ సంకల్పములచే నీప్రపంచమును నిండించుచు నిచ్ఛా శక్తిచే వానికి చైతన్యము నిచ్చుచున్నావు. ప్రతి మానవుని యందును భూత, ధాతు, సస్య, మను ష్య, దేవ వర్గముల కాధారమైన ద్రవ్యోపపత్తి యు

న్నది. ప్రతి నరునియందు పులి, పాము, పంది, సురుడు, అసురుడు, సాధుపురుషుడు, దుష్టుడు, మహాత్ముడు, దేవుడు కాగలశక్తియున్నది. ఏరూపమును, ఏస్వభావమును బొందదలచినను పొందవచ్చును. నీ శిరముపై గోచరించుచున్న సంకేతమును జూడుము. పరస్పరము సంధించియుండు త్రికోణద్వయములు ప్రకృతి పురుషులను సూచించుచున్నవి. వాని నావరించుకొనియున్నసర్ప మనంతమైన కాలస్వరూపమును నిర్దేశించుచున్నది. అనంతమగు కాలమున ప్రకృతిపురుషు లవిచ్ఛిన్నముగా గలిసియుందురని పై సంకేతమువలన దెలియవచ్చుచున్నది. క్రింద బల్లపైనున్న సంకేతమును జూడుము. అదికూడ ఆ యర్థమునే బోధించుచున్నది కాని వ్యష్టిగా నున్న మానవున కన్వయించును. నీలోనుండు త్రికోణద్వయములను జగములోనుండు త్రికోణద్వయములతో నేకీభవించులాగున జేసిన జగమందున్న శక్తులన్నియు నీయాధీనమగుటయేగాక నీయందును ప్రకాశించును.

రసాయనమున కేయేపదార్థములు చేరవలయునో యని పథికు డాలోచించుచుండగా తారకసాధువు కనుగొని మరల చెప్పసాగెను.

తారకసాధువు.—సచేతనవ్యాపారము లన్నియు చైతన్య వికాసముకొరకే నడచుచున్నవని తెలియుము. ఎవరు ప్రాణశక్తిని స్వాధీనము జేసికొని ప్రయోగించగలరో వారే రసాయనజ్ఞులగుచున్నారు. నూతనరూపములను సృష్టిచేయుసామర్థ్యము వారికి వచ్చుచున్నది. ఆరూపములకు నూతనద్రవ్యమునుజేర్చుశక్తి వారికి కలుగుచున్నది. సామాన్యుడైన రసవాదశాస్త్రజ్ఞునకు క్రొత్తగా వస్తువులను కలుగజేయు సామర్థ్యముండదు. రసవాది తనయాధీనమందు సిద్ధముగానున్న వస్తువులను వేరువేరువిధముగా జేర్చి క్రొత్తక్రొత్త సంసర్గవస్తువులుగా గల్పించ గలడు. రసాయనజ్ఞుడైననో దృష్టి కగోచరమైన ప్రకృతిభండారము నుండి యవసరమైనద్రవ్యము నాకర్షించి వస్తువృద్ధిని జేయగలడు. రసవాదియొక్క (Chemist) పరిశోధనలచేతన ప్రకృతిపై జరుగుచున్నవేకాని పైకివెళ్లవు. రసాయనజ్ఞుడైననో (alchemist) ప్రాణశక్తినే తనయాధీనము

జేసికొని తనకిచ్ఛకలిగినరూపమును గల్పించగలడు. రసవాదిగంధకము నావిరిగామార్చి మరల నా యావిరి నుండి అంతేమొత్తముగల గంధకమును గలుగజేయ గలడు. ఒకతోటవాఁడు విత్తనమును విత్తి యదివృక్షముగా వృద్ధియగుటకు దగిన యుపపత్తుల నమర్చుచున్నాడు. విత్తనమున వృక్షమగు ద్రవ్యముండినను అది వృక్షముకాదుగదా? క్రొత్తగా చెట్టునేబుట్టించి దానినుండి అనేకవిత్తనములు పుట్టులాగున సన్నివేశములను గల్పించగలవాడే నిజమైన రసాయనజ్ఞుడు.

పథికుడు.—తమ సామాజికులు ఇనుమును, వెండిని, పాదరసమును బంగారుగా జేయగలరని నేను వినియున్నాను. ఈ లోహములలో బంగారు లేదుకదా? లేని పదార్థమును గలుగజేయు టెట్లు?

తారకసాధువు.—నవనాగరీకతయొక్క "తెలిసినమూర్ఖత" నీద్వారా వెల్లడియగుచున్నది! ఆధునిక శాస్త్రజ్ఞులు మాధ్యాభిప్రాయములు, శాస్త్రవాసనలు ననెడియావరణములను నిర్మించుకొని సత్యమును గను

గొనుట కసమర్థులై యున్నారు కాన వారికి సత్యము బహుదూరమందున్నది. నేను చెప్పెడు సంగతులను మరల నాలకింపుము.

ప్రకృతి యేకవస్తువు. దానిలోనుండు పరమాణువు సయితమొకభాగము. పరమాణువునందు సహితము ప్రకృతిలోని శక్తులన్నియు నిమిడియున్నవి. తగిన సన్నివేశములు సిద్ధమైనయెడల ప్రతిపరమాణువు నొక జగముగా బరిణమించగలదు. జడచైతన్యముల విషయమై మీ భౌతికులకు సుసంబద్ధములైన యభిప్రాయము లింకను కలుగలేదు కాన వారు నిజమును గ్రహింపజాలకున్నారు. కలిపురుషునకును, దేవునికిని నిత్యవైరమును గల్పించియున్న ద్వైతవాదము లోకములో బహుదుఃఖమును గలుగజేసి యున్నది. జగమందనేకశక్తులున్నవని భౌతికులు నిర్దేశించు సిద్ధాంతములచే ననేకపండితులు భ్రాంతిగొని వివేకశూన్యులై యజ్ఞానదశకు వచ్చియున్నారు. మూలప్రకృతి యొక్క గుణముల విషయమందును, ప్రకృతిపురుషులకు గలతారతమ్యవిచారమందును భౌతికుల కేమి తెలియును? అసంసర్గభూతములని వారు నిర్దేశించు

ద్రవ్యములు మూల ప్రకృతినుండి యావిర్భవించియు న్నవి. మూలప్రకృతి యేకమైనది కాన దానిలోనుండు పరమాణువులకు కొన్ని వేళలయందినుముగా బరిణ మించుటకును, మరికొన్ని సందర్భములయందు పాద రసము మొదలగు యితర పదార్థములుగా వ్యక్తమ గుటకును శక్తియున్నది. సప్తలోహములలో ప్రతి లోహమునకు నితరలోహములుకాగల శక్తి బీజరూప ముగానున్నదని ప్రాచీనులు చెప్పియున్నారుకదా? ఒక వస్తువును మరియొకవస్తువుగా మార్చవలెనన్న మొ దటి వస్తువును మూలప్రకృతిలో విలీనముజేసి మరల నాద్రవ్యమును క్రొత్తవిధానముగా సంసర్గము జేయ వలెనని వారు బోధించియున్నారు.

ప్రత్యక్షముగా బరిశోధించి నిజమును కనుగొన వలెనని నీవు కుతూహలపడుచున్నావు కాన మూలద్రవ్య ముండిన బంగారము నెట్లు గలుగ జేయవచ్చునో పరీ క్షించుదము.

ఇట్లుచెప్పి యాతారకసాధువు ఆసనముపైననే కూ ర్చుండి బల్లపైనున్న యొకమూసను జూపించి దాని లో భాగమును దుడిచి ముక్కాలు పీటపైనునిచి వేదికపై

వెలుగుచున్న దీపముమీద నాపీటనుంచు మని పథికుని కాజ్ఞాపించెను. పథికు డట్లుచేయగానే వానిజేబులోనున్న వెండిముక్కలను ఆ మూసలోవేయుమనెను. పథికుడా ముక్కలనువేసెను. కొన్ని నిమిషములైన పిదప ఆ ముక్కలు కుతకుతలాడ నారంభించెను. అది నీరై కరగిన పిమ్మట ప్రక్కబల్లపైనున్న యొక సీసానుండి ఎర్రనిపొడిని కొద్దిగాదీసి మూసలోవేయ నియమించెను. బల్లపై నొకచిన్న చంచాయుండెను. దానితో నారక్తవర్ణము గల చూర్ణమును సీసానుండి తీసి మూసలోవేయ నుద్యమించగా నది యెక్కువయని యాచూర్ణమునంతటిని సీసాలో మరల వేసి కాగితమునకు లేపనమైయుండునంత వేసిన చాలునని చెప్పి వేయించెను. కాగితమున కంటుకొని యుండిన పొడి బహుస్వల్పమైయుండెను కాన కాగితమునే దానిలోవేసెను. అది తక్షణమే కాలిపోయెను. కరగినలోహమునురుగు పైకి లేవ నారంభించెను. అది మూసనుండి పొర్లిపోవునేమోయను భీతికలిగెను కాని యానురుగుకు సంబంధించిన ప్రతి బుద్బుదము పైకిలేచునంతలో పగిలి వేరువేరురంగులను ప్రదర్శించుచుండెను.

ఇట్లు 15 నిమిషములు గడచిన పిమ్మట కుతకుత లాడుట నిలిచి బుద్బుదముగా లేచుచున్నలోహపుముద్ద మూసయొక్క యడుగుభాగమున జేరెను. చల్లారిన పిదప దానిని నొకరాతిపై బోర్లించగా నా ముద్దపదియారువన్నెల బంగారమైగోచరించెను. "ఈబంగారును నీ వెంట దీసుకొనివెళ్లి నీకిచ్ఛగలిగినట్లు పరీక్షింపుము. నేను మోసపోతినని చెప్పకుము" అని పథికుని గూర్చి పలికెను.

పథికుని యాశ్చర్యమునకు పారము లేకయుండెను. "అమూల్యమైన యారక్తవర్ణ చూర్ణము కొరకు జను లెంత ద్రవ్యము నైనను సెలవుజేయ సిద్ధముగానుందురు కాబోలు" అని భావించెను. ఆ పొడిని తయారుచేయు విధానమును దెలిసికొనవలెనని యాశ కలిగెను. తాను భాగ్యవంతుడుకావలెనని యపేక్షించి రహస్యము నడుగుచున్నాడని యా సాధుపురుషుడు భావించునేమో యను భీతిచే వాడు తన మనోరథమును వెల్లడి జేయలేదు. తారకసాధువు వాని మనోగతభావము నెరిగి చెప్పసాగెను.

తారకసాధువు.—నరులు పారమార్థికులగువరకా యెర్ర పొడిని తయారుచేయు విధానమును బోధించము.

అది చాల రహస్యమైన విషయము. కేవలము స్వానుభూతిచే దెలియదగిన యంశమై యున్నది. శక్తులు తమయందవ్యక్తముగా నున్నవను సంగతినే తెలియక యున్నవారలకు వాని ప్రయోగమును బోధించవచ్చునా? బ్రహ్మాండములో నున్నశక్తు లన్నియు మనుజులయందుండుట నిశ్చయమే.

స్వర్ణబీజము లేకనే యొకపదార్థమునుండి బంగారును గలుగజేయవచ్చునను యూహ వివేకమైనదికాదు. ప్రతియొక పదార్థమందును స్వర్ణబీజమున్నది. జగద్వస్తుశుద్ధీకరణాలయములో నినుము మొదలగు వస్తువులు బంగారుకావలెనన్న చాలకాలముపట్టును. ఆవస్తువులకు సంబంధించిన భూతములయందు స్వర్ణతత్వము తప్పక యున్నది. మూలభూతములపై జగదేకమైయున్న ప్రాణశక్తిని బ్రయోగించనియెడల స్వర్ణతత్వము వృద్ధియై నోచరించదు. ప్రాణశక్తిని మనము ప్రయోగము జేయక స్వభావమునకే విడిచిన యెడల సావకాశముగా ఫలము నిచ్చుచున్నది. పారమార్థిక ప్రజ్ఞజేతను, జ్ఞానముచేతను ప్రకృతిలోనుండు నిచ్ఛాశక్తిని స్వాధీనము జేసి కొని పనిచేయ నారంభించిన ప్రాణశక్తియొక్కపని బహు

త్వరగా నడచుచున్నది. ఈకారణమువలననే మహాత్ములే క్షణమందైనను బంగారును గల్పించగలరు. మామిడివిత్తనమును విత్తి నారింజపండ్లను పండించవలెనన్ననేలాగు సాధ్యముకాదో యాలాగే స్వర్ణబీజములేక స్వర్ణమును గల్పించుట సాధ్యముకాదు. ఇదిగాక నారింజపండ్లు కావలెనని యా చెట్టు విత్తనమును రాతిపై విత్తరుకదా! చక్కగా నీళ్లుపారి యెండకాయునట్టి క్షేత్రములో దానిని విత్తనియెడల నది వృక్షమై వృద్ధికాజాలదు. ఆలాగుననే, స్వర్ణబీజమును సానుకూలమైన మట్టితో జేర్చకుండిన స్వర్ణముగా బరిణమించదు. ఎఱ్ఱని పొడిలో స్వర్ణమును వృద్ధిజేయు ప్రాణతత్వమున్నది కాన నది సానుకూలమైన మట్టియని చెప్పవచ్చును. జగత్తులో ప్రాణములేని పదార్థమేలేదు. కాని యన్ని పదార్థములయందు నది పనిచేయుటలేదు. కొన్నివస్తువులలో నాప్రాణ మవ్యక్తమై యున్నది. ఏవస్తువందు ప్రాణము పనిచేయ నారంభించునో యావస్తువు మూసలో నీకు గోచరించినవిధమున భిన్నములైన రంగులను బ్రదర్శించుచున్నది. రూపాంతరము కావలసియున్నవస్తువు శీతలముగాను, ఘనముగాను నుండిన దానియందు ప్రాణము చాల సావకాశముగా బ్రవేశించును. అట్లైనను చివరకావస్తువు మారుట నిశ్చయ

మే. ఆవస్తువు కరగి ద్రవమైయుండిన ప్రాణము త్వరగా దానితో జేరుకొని బుద్బుదములను బుట్టించి వేరురూపమును బొందించును.

పుట్టి, పెరిగి రూపాంతరమును బొందుట యను నీ వ్యాపారత్రయము సస్యపశువర్గములయందు దప్ప మరి యేవర్గములయందును తటస్థించదని తెలిసికొని యున్నావా? అవి ఖనిజవర్గమందు నడచుచున్నవి. సస్యపశువర్గములలో బహుత్వరగా తటస్థించుచుండుటచే నవి మనకు గోచరమగు చున్నవి. ఖనిజవర్గమందు సావకాశముగా జరుగుచుండుటచేత నవి గోచరించుటకు మానవుల యనేకతరములు కావలసి వచ్చును.

సస్యవర్గ మభివృద్ధి యగుట కావశ్యకమైన బీజము సస్యములలోనే పుట్టుచున్నది. జంతుజాలములయభివృద్ధికి గావలసిన బీజము జంతువులలోనే పెరుగుచున్నది. లోహములవృద్ధి కవసరమైనబీజము లోహములయందేయున్నది. లోహముయొక్క రూపమును మార్చవలెనన్న దానిని కరగించినమాత్రమున చాలదు. ప్రాణశక్తియొక్క వ్యాపారమునకు దానిని లోబరచవలెను. ఎర్రనిపొడిచే నీకార్యమగుచున్నది. దాని స్వల్పభాగమైనను విశేష స్వ

ర్ణమును గలుగ జేయగలదు. నీవెండిముక్కలను బంగార ముగాజేసిన పొడి యెంతస్వల్పముగానుండెనో చూచితివి కదా? కాగితమున కంటుకొని యున్న పొడియంతయు బంగారముచే స్వీకరింపబడలేదు. దాని నిప్పుడే పరీక్షించిచూడుము.

బంగారు చల్లపడి యున్నందున పథికుడు దానిని హస్తమందుంచుకొని పరీక్షించెను. దాని కాచూర్ణకణము లంటుకొనియుండెను. అవి బంగారమున కవసరమైన యణువులుగా నుండలేదని వానికి తేటపడెను.

పథికుడు—స్వామీ? ఈ యెఱ్ఱని పొడిని తయారు చేయు విధానమును నాకెందుకు కరుణించరాదు? నేనాజ్ఞానమును స్వార్థము కొరకెన్నటికి నుపయోగ ముచేయనని ప్రమాణముచేసెద. ఐహిక సుఖ సంపత్తులు నిరర్థకములనియు, పరమపదమున కవి చాల ప్రతిబంధకములనియు నేను చక్కగా గ్రహించియున్నాను. సత్యము కొరకే సత్యమును దెలియ నపేక్షించుచున్నాను కాని స్వార్థసంబంధమైన యాశ నాకేమియులేదు. ఈ చూర్ణముయొక్క రహస్య

మును నాకు బోధించితివేని నేను నన్ను మరచి సర్వ సోదర భావమును వృద్ధిజేయుటకై మానవవర్గము నకు నాజన్మమునే ధారవోసెద.

తారకసాధువు—మంచిద్ది. నాచేతనైనంత నీకు సహాయము జేసెదనుకాని నీవే స్వంతముగా బని చేయవలసిన యవసరమున్నది. బంగారమును జేయు విధము నుపదేశించుటయు జీవజగత్తులలోనుండు గుప్త శక్తులను నిర్దేశముగా బోధించుటయు నొకటే. అది కొన్ని గంటలలో లేక కొన్ని దినములలో నుపదేశించుటకు సాధ్యమైన పనికాదు. సూర్యాస్తమయమైన పిదప నిన్నిచ్చట యుండనిచ్చుట మాయాశ్రమ నియమములకు విరుద్ధముగానుండుటచేత నీవే స్వంతముగా వ్యాసంగము జేయుటకు రసాయన గ్రంథము నిచ్చెద. నీయనుభవమును, శక్తిని ప్రసన్నముగా నుంచుకొని, మనస్సును మేఘావరణములు లేక యుండులాగున భద్రపరచుకొని దానిని వ్యాసంగము జేసిన నేనునీసమీపమందే యదృశ్యముగానుండి గ్రంథములోని రహస్యసంకేతములు చక్కగా నీకు బోధయగునట్లు చేసెద.

ఉత్సాహకరములైన యీమాటలను జెప్పి తారక సాధువు పథికునకొక పురాతన గ్రంథమునిచ్చెను. దానిలో నానావిధములైన వన్నెలుగల చిత్రపటములు, సాంకేతికాకృతులునుండెను. ఆగ్రంథమునకు "గుప్త సంకేతములు" అను నామముండెను.

తారకసాధువు.—ఇదిచాలగొప్పగ్రంథము కాన నీవీపర్వతమును దిగి పోవునపుడు మోయజాలవు. నీవు పోవుపూటకూలి బసకు దీనిని నేను బంపెద. నీవు చేరునంతలో నీగ్రంథము నీబల్లపై సిద్ధముగానుండును.

ఈకృపకు పథికుడు చాల కృతజ్ఞతా భావమును జూపించెను. గ్రంథముయొక్క పుటల నొకతూరి త్రిప్పివేయుచు విషయ సూచికను జూచెను. వ్యష్టిసమష్టులు, కాలరహస్యము, గుప్తసంఖ్యలు, భూతచతుష్టయము, వస్తుత్రితయము, పునరుత్పత్తి, శుద్ధీకరణము, తత్త్వోపదేశము మొదలగు విషయములా గ్రంథమందు చెప్పబడియుండెను. తారకసాధువు పథికుని గూర్చి మరల జెప్పసాగెను.

మిత్రుడా! నీవీగ్రంథము ననుభవపూర్వకముగా దెలిసికొంటివేని మావిద్యలలో నత్యల్పమగు "రసాయనవిద్య" నీకుపట్టుబడును. గులాబిపువ్వుల సంకేతము, శూల రహస్యము చక్కఁగా వేద్యమై యమరత్వమునిచ్చు కల్పవృక్ష చింతామణులు నీకులభించును. అప్పుడు నవ్రజవై దూర్వాదులను సృజించగల ప్రాణశక్తి నీయాధీనమై పశువును మానవునిగాను, మానవుని దేవునిగాను, జేయు సామర్థ్యము నీకు కలుగును. మానవుని దేవునిగా జేయుటయే నిజమైన "సిద్ధరసప్రయోగము." ఇతరప్రయోగములన్నియు బొమ్మలాటలవలెనుండును. నిత్యశుద్ధమైన సత్యవస్తువు మనయంతరంగమందే సిద్ధముగా నుండ కాలక్రమములో నశియించు మాయికవస్తువులను బొందయత్నించుటచే నేమిప్రయోజనము?

పథికుడు.—తాము కరుణించు నీగ్రంథము నితరులకు జదువ నియ్యవచ్చునా? వేరొకప్రతిని వ్రాయించి ముద్రించవచ్చునా?

తారకసాధువు.—ఈగ్రంథమును క్రమముగా నర్థముజేసికొనువారే లోకమందు లేరు. ఒకరిద్దరు సత్యాన్వే

షులుండినను వారిని నిమిత్తముగా నుంచుకొని "సూకరములకు ముత్యములను వేయునట్టి" యుత్తరవాదిత్వమును వహింప నిచ్ఛయించిన నీవు దీనిం బ్రకటించవచ్చును. ఈగ్రంథమందు సూచింపబడిన సంకేతములను జదివి తెలిసికొనుటయేగాక యనుభవపూర్వకముగాగూడ గ్రహించవలెను. చుక్క మొదలుకొని పరస్పరము రెండువైపులనుండి మిళితమగు త్రికోణద్వయమువరకు నుండు సంకేతములకు మూడు విధములైన యర్థములున్నవి:—1. సులభముగా గ్రాహ్యమగు బాహ్యార్థము. 2. బుద్ధిచే దెలియబడు యంతరార్థము. 3. ఆత్మకుగోచరించు అనుభవార్థము. ఈమూఁడింటిలో ననుభవార్థము పరమరహస్యమైయున్నది. అదియపరోక్షముగా సాక్షాత్కరించదగినది. దేహేంద్రియములకగోచరమైనవస్తువాత్మకు గోచరించుచున్నది. దానినే యనుభవార్థమని చెప్పెదరు. మానవు డెపుడాంతరంగికవస్తువులనుహృదయమందే గ్రహించి యంతర్దృష్టిచే జూచుచు వాని గుణములను దెలిసికొనునో యప్పుడే జ్ఞానప్రదీపనమునుబొంది మహాత్ముడగుచున్నాడు.

ఒకటినుండి మూడుకలిగెను. మూటినుండి యేడు వచ్చెను. మూడుసంఖ్యలు లేక మూడక్షరములు ఒకటితోనొకటి చేరగా నాలుగుసంసర్గములు పుట్టుచున్నవి. ఆనాలుగు సంసర్గములు మొదటి మూడింటితో గలిసిన యేడగుచున్నవి కాన ప్రతిసంకేతమునకు నేడర్థములున్నవని చెప్పవచ్చును. ఈకారణమును బట్టి ప్రకృతిచాలచిక్కుగానున్నదని చెప్పెదరు. లోతుగా దిగి విచారించకున్న చిక్కును విడిపించసాధ్యముకాదు. సంకేతముల గూడార్థములను నీకు బోధించుటలో ప్రయోజనములేదు. సంకేతములు జీవజగత్తులయందున్న రహస్యములను బోధించుచున్నవి. జగమునీవే, జీవుడునీవే, ఈవస్తువులన్నియు నిన్నే నిర్దేశించుచున్నవి. ఈసంగతు లన్నియు నీయనుభవమునకు రావలెనుకాని మేమెంతవిశదముగా వర్ణించినను ప్రయోజనములేదు.

పథికుడు.—అట్లైన నీగ్రంథవ్యాసంగము నిష్ఫలమని తోచుచున్నది!

తారకసాధువు.—ఎవరికీ సంగతు లనుభవగోచరములగునో వారికిట్టి గ్రంథములను జదువుటచే నుపయోగము

లేదు. ఎవరికీ గ్రంథములను జదువుట యవస
రమో వారి కివి యర్థముకావు. దర్పణముల వలన
నెట్టిప్రయోజన మున్నదో యీ గ్రంథముల వలనను
జనులకట్టి ప్రయోజనమే యున్నది. జనులు దర్పణము
లలో తమప్రతిబింబములను గదా చూచుచున్నారు?
ఒకకోతి దర్పణమందు ప్రతిబింబమైయున్న తన స్వ
రూపమును జూచి యది తనదని భావించక వేరొక
కోతి తన్నభినయించుచున్నదని తలచు లాగున
మానవులు గ్రంథములో వర్ణింపబడిన సంగతులు
తమకు సంబంధించినవి కావని భ్రాంతి జెందుదురు.
సత్యబోధక గ్రంథమును జదువుటచే సత్యముయొక్క
లక్షణములను దెలిసి కొనవచ్చునుకాని సత్యమును
సాక్షాత్కరించి కొనజాలము. వ్యాఖ్యాన సహిత
ముగా వేదము నొప్పగించిన మాత్రమున దానియం
దుపపాదింప బడియున్న సత్యము సాక్షాత్కారమైన
దని చెప్పవచ్చునా? మానవు డాత్మస్వరూపుడు
కాన వాని స్వానుభవమున కెంతగోచర మగుచు
న్నదో యంతయే వాని ప్రజ్ఞయని భావించవలెను.

నేను మీామర్త్య లోకమందున్నపుడు వైద్యుల
తోను, మతగురువులతోను చాల మనస్తాపములను

కలుగ జేసికొను చుంటిని. వారిరువురును సామాన్యముగా జనులయజ్ఞానముచే జీవించెదరు. జనులకు నేను తెలివి తేటల నిచ్చుచురాగా స్వోదరపరాయణులైన యాయుభయుల విషయమై యనాదరణ యెక్కువయగుచు వచ్చెను. లౌకిక విద్యలయందు జనులెంత పాండిత్యమును సంపాదించెదరో యంత యధికముగా ప్రజ్ఞావిహీను లగుచున్నారని నాకు తోచుచున్నది. ఆహేతువుచే నీప్రదేశమందు వారి వాగ్వాదములు, కుతర్కములు లేవు కాన నేను శాంతచిత్తుండనై వసియించుచున్నాను. ఎప్పుడైన నొకతూరి నేను లోకముయొక్క స్థితిని బరీక్షించి చూచుట కలదు. ఎప్పుడు చూచిన నది యుత్తమస్థితికి వచ్చిన చిహ్నములను బ్రదర్శించుటలేదు.

పథికుడు.—లోక మేలాగైననుండనిమ్ము. భౌతికశాస్త్రము మొదట కంటె నుత్తమ స్థితి యందులేదా ?

తారకసాధువు.—కొన్ని విషయములలో నున్నత స్థితియందును, మరికొన్ని విషయములలో హీన స్థితియందును భౌతికశాస్త్రమున్నదని చెప్పవచ్చును. ఆశాస్త్రికారులు కల్పించి యున్న నూతన యంత్ర

ములు మానవులకు బాహ్య సుఖములను, నైహికా పేక్షలను వృద్ధి జేయుచున్నవి. మొదటనే వస్తువు లను సుఖప్రదములుగా భావించి యుండిరో యావస్తు వులనే యిపు డావశ్యకములుగా జనులు పరిగ్రహించి యున్నారు. ఇంతియే గాక నూతన పరికరము లనే కములు భౌతికశాస్త్రశోధనావృత్తియందున్న వారి వల్లనే కల్పింప బడినవి కావు.

మనుష్యుల మనశ్శక్తులు వికాసము కాగానే భౌతికులు కల్పించి యున్న నూతన సామగ్రు లనవసర ము లగుచున్నవి. మందు, తుపాకులు పుట్టిన పిదప పూర్వపు శస్త్రాస్త్రము లనవసరములు కాలేదా? నూతన యంత్రములు కల్పింప బడినపు డెల్లను పురాతన సామగ్రులు నిష్ప్రయోజనములగుచున్నవి. ఇది సహజ మైన స్థితి యని తెలియుము. ఇనుప దారులను తంతిమా ర్గములను గల్పించినందుకై మీరు చాల గర్వితులై యుండవచ్చును. ఎంతదూరమైనను మనో వేగముచే బోవు శక్తి మీకు లభించునపుడు మీయినుపదారులు, తంతిమార్గము లనవసరము లగుచున్నవి. భౌతికశాస్త్ర మనెడి రథమునకు ప్రకృతి భూతము లనెడు గుఱ్ఱములను

గట్టు నుపాయము మీకు తెలిసిన గరుత్మంతునివలె మీ రెంతదూరమైనను గగనమందు సంచరించవచ్చును.

పథికుడు.—నరులకు గగన గమనము సాధ్యమగునా? స్థూలదేహముయొక్క భారము దానికి ప్రతిబాధకమై యున్నదికదా! దయచేసి యీసంగతులను సెలవిచ్చి నా కానందము గలుగ జేయుడు.

తారకసాధువు.—మనశ్శరీరమునకు చైతన్యము కలిగి నపుడు గగనగమనము సాధ్యమగుచున్నది. అప్పుడు స్థూల దేహమును వెంబడి తీసుకొని వెళ్లవలసి న యవసరముండదు. భుజించుచు, సంచరించుచు, నిద్రయందే తన యర్ధాయువును బోగొట్టుకొనుచు ప్రజ్ఞా శూన్యమైయుండు స్థూలదేహమును మానవు డని భావించుచున్నావా! ఆత్మయొక్క స్వేచ్ఛాప్ర వృత్తికి ప్రతిబంధకమై, రక్తమాంసాస్థిస్నాయువులు మొదలగు ద్రవ్యములచే నిండియున్న స్థూల శరీరమును నరుడని తెలిసికొనుచున్నావా ? అట్లు నీవు తెలిసికొని యుండిన భ్రాంతుడవగు దువు. మనుష్యుడు స్థూలదేహముకాదు. వాడ

దృశ్యుడై, సంకల్పించుచు, ననుభవించుచు దన్నుదాను తెలిసికొనుచు చైతన్యమయమూర్తిగా నున్నాడు.

పథికుడు.—మనశ్శక్తియే మానవుడని చెప్పవచ్చునా?

తారకసాధువు.—అట్లుచెప్పిన, సంకల్పించిన స్థలమందంతటను మానవు డుండగలడని నీ వంగీకరించవలసి వచ్చును కదా! వానిప్రజ్ఞ యెచ్చోటనుండునో వాడచ్చోటనుండును. సంకల్పమనునది మనశ్శక్తియేకాని దేహశక్తిగాదు. పార్థివదేహముయొక్క మెదడుకు స్వాంతముగా భావించుశక్తిలేదు. మనస్సెచ్చటెచ్చట సంచరించునో యచ్చటచ్చట మానవుడుండును. వాడుండుచోట స్థూలదేహముండనవసరములేదు. వేసవికాలమున సంచరించునపుడు చలికాలమున నుపయోగించువస్త్రములను వెంటబెట్టుకొనిపోవ నెట్లవసరము లేదో యట్లనే సంకల్పము వెళ్లినప్రదేశములకు స్థూలదేహమును గొనిపోవ నక్కరలేదు. సంకల్పము మనస్సుయొక్క యొకశక్తి విశేషమని చెప్పితిని. మనస్సు విశ్వవ్యాపిగా నున్నది. స్థూలశరరీముయొక్క మెదడు నుపయోగించకనే భావించునభ్యాసము మనకెపు

డు కలుగుచున్నదో యపుడు మనము మనస్సంకల్ప ముతోఁగూడా జగమునంతయు సంచరించగలము.

పథికుడు.—మనస్సు విశ్వవ్యాపియని చెప్పిననది యుపాధిరహితమై యుండవలెను కదా? ఉపాధి సహితముగానున్న మెదడు యొక్క సహాయము లేకనే మనస్సు భావించ నోపునా?

తారకసాధువు:—మనస్సు యుపాధిరహిత మని నీకెవరు చెప్పిరి? కేవల మల్పవర్గములకు చేరిన ప్రాణులగు లోహములకును, సస్యములకును, పశువులకును యుపాధులుండగా సర్వోత్కృష్ట తత్వమై ప్రాణప్రజ్ఞలతోఁ గూడియున్న మనస్సు కుపాధిలేదని చెప్పవచ్చునా? వాయువుకు సంకల్పించు ప్రాణయున్నదా? దానికి యుపాధిలేదు! మనస్సు కూడా వాయువు వంటిదనియు, వట్టిబయలనియు తెలిసికొని యున్నావుకాబోలు! మనస్సు బయలుగాదు, వాయువువలె నుండునది కాదు. జగత్తులో దానికి నుత్కృష్టమైన యుపాధియున్నది.

ఉత్తమమగు యాత్మప్రజ్ఞ యెవనియందు వికసించ లేదో యా యల్పాత్ముడు మెదడుయొక్క సహాయము లేక భావింపజాలడు. తనకు లభించకున్న ప్రజ్ఞానుభవము నెవడు గ్రహించగలడు? తనలో నవ్యక్తముగానున్న శక్తి నెవడు ప్రయోగించగలడు? ఎవరుత్కృష్టమైన యాత్మప్రజ్ఞలో నిలిచియున్నారో, యెవరుస్థూలోపాధికతీతములగు నుత్తమ తత్వములయందు తమప్రాణమును బ్రతిష్ఠ జేసికొని యున్నారో వారు పారమార్థిక ప్రజ్ఞకు కేంద్రస్థానభూతులై యుందురు. మనము సంకల్పించు నిమిత్తము హాస్తపాదము లెట్లనవసరములో యట్లనే పారమార్థిక లోకమందు ప్రజ్ఞను బ్రతిష్ఠించికొని యుండువారలకు స్థూలదేహము యొక్క మెదడు సంకల్పించుట కనావశ్యకమైయున్నది. స్వప్నచారులు దూరదేశములకు వెళ్లి వచ్చిన వృత్తాంతములు నిదర్శనమునకురాగా వారా దేశములకు వెళ్లియుండుట నిజమని బోధపడదా? ఆ కాలమందు వారుస్థూలదేహముయొక్క మెదడును తమ వెంబడి తీసికొని వెళ్లియుండిరని చెప్పవచ్చునా?

తనయసంబద్ధమైన ప్రశ్నకై పథికుడెంతయో వగచెను. దాని నాక్షణమే కనుగొని తారకసాధువు మృదుమధురోక్తులతో మరల చెప్పసాగెను.

తారకసాధువు:—నీవు సృష్టి వైచిత్ర్యమును దెలియ గోరితివేని నిన్నునీవు తెలిసి కొనుటకు మొదట ప్రయత్నము చేయుము. నీ దేహముయొక్క సౌష్ఠవమును, దానివినాశక్రమమును తెలిసికొనిన మాత్రముచే నుపయోగములేదు. నీమనస్స్వరూపమును, నీయాత్మకు సంబంధించిన దేహతత్వములను నీవు బాగుగా దెలిసికొనవలెను. నాడులద్వారా ముఖ్యముగ నాడులమధ్యముననుండు సుషుమ్నద్వారా నీ పాదములకు నీమెదడుకు సంబంధములేక యుండిన నీ పాదముల కేమి తటస్థించినను నీయనుభవమునకు వచ్చుచుండలేదు. నీ పాదములను గాల్చినను, లేక కోసివేసినను నీకండ్లకగుపడుచుండెనేకాని నీ కాయాతన యనుభవమగుచుండలేదు. అట్లైనను, నీవు భావించునది మెదడుతో గాని పాదములతో గాదుకదా? ఆస్థితిలో మెదడే భావించుటకు సాధనముగానున్నది. నీవు యోగాభ్యాసమునుజేసి కొంతయభివృద్ధినై యుంటివేని నీ భావనాప్రజ్ఞలను మెదడునుండి తప్పించి పాదములలోనో లేక మరియేభాగమందో చేర్చి నీవచ్చటనే యుండవచ్చును. పరిశోధించువారి యిచ్ఛాసంకల్పములవల్లను, మెస్మరిష్టు (mesmerist)

యొక్క యిచ్ఛాసంకల్పములవల్లను ప్రజ్ఞానుభవము లను దేహములో నొకభాగమునుండి తప్పించి మరి యొకభాగమున జేర్చవచ్చునని మీాభౌతికజ్ఞు లంగీ కరించియున్నారు. ప్రతిమనుష్యుడు తన యిచ్ఛా సంకల్పములచే తనప్రజ్ఞానుభవములను తనలోగాని, జగత్తులోగాని యొకస్థలమునుండి మరియొకస్థలమునకు మార్చవచ్చును. వాని ప్రజ్ఞానుభవము లెచ్చటనుం డునో వాడుకూడ నచ్చటనేయుండును. జగమునకును, మానవునకును చాల యాంతరంగిక సంబంధమున్నది. ఆసంబంధము ప్రకాశము గావచ్చును లేక అప్రకా శముగా నుండవచ్చును. తనకు, జగత్తుకు సంబం ధము లేదనియు, తానుమాత్రము వేరేయనియు నెవ డు తెలిసికొనునో వాడు భ్రాంతుడని చెప్పవచ్చును. జగమంతయు నొక్కటే. ఇదియే యోగముయొక్క ముఖ్యసిద్ధాంతము. జగత్తులోనుండు ప్రాణులన్నియు బరస్పరము సంబంధించి యుండుటయేగాక యొకప్రాణి యొక్క వ్యాపారము మరియొకదానిలోగూడ వ్యాపిం చుచున్నది. "నేనువేరు"అనుభావము దేహభ్రాంతిచే గలిగినదేకాని యథార్థమైనదికాదు. తనకు బాహ్యా మందున్న దేహము తానుకాదు. ఆదేహము తాను

కొంతకాలము నివసించుటకై యేర్పడిన గృహమై యున్నది. జగత్తుకు సంబంధించిన ప్రకృతి పదార్థము యొక్క యొకతరగతికి చేరిన భాగముచే నాదేహము నిర్మింపబడియున్నది. దేహములు మారుటకలదు. అవి మనుష్యుల యాంతరంగిక గుణములను కొద్దిగా ప్రకాశముజేయు దర్పణములై యున్నవి. కొంతకాలమువరకు జీవించియుండి, యనుభవశక్తులకును, ప్రజ్ఞకును, నావాసస్థానమై సచేతనమువలె గోచరించుచున్నను మానవశరీర మచేతనమైన దర్పణమేకాని అన్యథా కాదు. ప్రాణము, ప్రజ్ఞ మరియు ననుభవము దేహమునకు సహజమైనవికావు. అవి జగముయొక్క యదృశ్యలోకములకు సంబంధించి మానవుని యదృశ్య స్వభావములుగానున్నవి. మానవునిమనస్సు విశ్వముయొక్క మనస్సులో నొకభాగముగా నున్నది. తమ నిజగుణములను దెలిసికొని యాంతరంగికశక్తులను బ్రయోగముచేయ నెవరభ్యసించెదరో వారు తమ దేహమందు లేక బయట నెచ్చోటనైనను తమప్రజ్ఞను బ్రతిష్ఠజేసికొని యచ్చట తటస్థించుదానిని జూచుచు, ననుభవించుచు, దెలిసికొనుచు వర్తించగలరు.

పథికుడు—ఇవి గొప్పసంగతులు కాన సంపూర్ణముగా నేను గ్రహించజాలను. స్వయంకృత నియమములచే బద్ధులైయున్న భౌతికశాస్త్రజ్ఞులీసంగతుల నంగీకరించ జాలరని నాకు దోచుచున్నది.

తారకసాధువు:—నీమాట నిశ్చయమే. ఇప్పటి భౌతికుల కివి సమ్మతము కానేరవు. వారి కర్థమగుట కూడ కష్టమే. వారియందు శాస్త్రవాసన యెక్కువగా నుండును. వారికి ప్రజ్ఞావికాసము తక్కువగానుండును. రాబోవువారికి శాస్త్రజ్ఞానము ప్రజ్ఞావికాసము సమముగా నుండును కాన వారికి సంగతులు చక్కగా బోధపడును. దురభిమానాజ్ఞానములు కవలలై యున్నవి. "నేనువేరు, నే నితరులకంటె దొడ్డవాడను" అని భావించు మనుష్యుని కహంకారము వృద్ధియగుచున్నది. బాహ్యశాస్త్రముల జ్ఞానమధికమైన కొలఁదిను మానవుడు తా నసమానుడనియు, పెద్దవాడనియు నహంకారియగుచున్నాడు. ఆధునిక విద్యావంతుల ప్రజ్ఞ చాలమట్టుకు వారి మెదడులోనే యున్నది. వారు పై మేడలో నివసించువారై యున్నారు. మాన

వుడు నివసించుచున్న గృహమునకు మెదడు ముఖ్య భాగముకాదు. ప్రాణముయొక్క మధ్యభాగమున ప్రజ్ఞ ప్రతిష్ఠింప బడకుండిన నాప్రజ్ఞకు స్థితియే తప్పి పోవును. యోగమందు వృద్ధి కాదలచినవారు మెదడుతో నాలోచించుటయేగాక హృదయమందు భావించుటకు సహిత మభ్యసించవలెను. ప్రతిదినమును తమసంకల్పశక్తిని హృదయస్థమగు ప్రాణముయొక్క మధ్యభాగమునకు కొనిపోవుచు తుద కచ్చటనే దానిని దృఢముగా బ్రతిష్ఠించవలెను. ఆరంభమందు వారికి చీకటి కమ్ముకొనునుకాని రానురాను వా రాయభ్యాసమును బూనికతో జేయజేయ హృదయమందొక జ్యోతి గోచరించి వారి మనస్సును ప్రదీపనము జేయును. నందాదీపమువలె యవిచ్ఛిన్నముగా వెలుగుచుండు నాజ్యోతి తన కిరణములను మెదడుకు పంపుటయేగాక నక్షత్రమండలమువరకు వ్యాపింపజేయగలదు. భూతభవిష్యద్వర్తమానములు దానియందు గోచరించును.

మనము స్వకల్పిత భ్రాంతులను బోగొట్టుకొని ప్రకృతి రహస్యములను జూడ నారంభించిన, నారహస్యము

లు స్పష్టముగా గోచరించును. మనస్వకల్పితాభి ప్రాయములను విడనాడితిమేని గొప్పగొప్ప యభిప్రాయములు సులభముగా బోధపడును. నరునిమనస్సు సమష్టిమనస్సులోని భావనలను ప్రతిబింబించు దర్పణమైయున్నది. మిత్రుడా! నిశ్చలమైన కాసారమందు మేఘములెంత విరళముగాగనబడుచున్నవో చూచితివా? దానిలో నొకటి రెండు తరంగములు పుట్టినను లేక యడుసుపైకివచ్చినను మేఘములంత విరళముగా గనుపించవుకదా? మనుష్యుని మనస్సుకూడ నాజలాశయమువలె నున్నది. అదినిర్మలమై ప్రశాంతమైయుండిన జగములోనుండు భావనలు దానిద్వారా స్పష్టముగా బ్రకాశించును. అది తరంగయుక్తమై మలయుక్తమైయుండిన జగములోని భావనలు చక్కగాగోచరించవు. మనము ప్రజ్ఞతో భావించదలచిన నాప్రజ్ఞయే మొదటలో సంకల్పించున ట్లవకాశమివ్వవలెను. ప్రజ్ఞకంటె మనమధికులమని తలచిన మనస్సు మనభ్రాంతులచేతను, పరులభ్రాంతులచేతను నిండినదై సత్యమును యథాస్థితిగా జూడ మన కవకాశమివ్వదుకాన మనకల్పితభావనల ద్వారా మనము సత్యమును గ్రహించెదము.

ఈరహస్యము మతములన్నిటిలోను సాంకేతికముగానో లేక గూఢముగానో చెప్పబడి యున్నది. మానవుని యధః పతనమును సూచించు పురాతన వృత్తాంతము యొక్క రహస్యమే యిది. మనుష్యుడు తనయిచ్ఛా సంకల్పములను ప్రకృతియొక్క యిచ్ఛా సంకల్పముల కనుగుణముగా జేసికొని పరిశుద్ధుడుగానున్నంతవరకు సత్యమును గ్రహించుశక్తి వానికుండెను. విశ్వశక్తికి విరుద్ధముగా భావించుట కెప్పుడు వాడారంభించెనో యప్పటినుండి సత్యమును గ్రహింపజాలక స్వంతకల్పనల యందే భ్రాంతుడగుచు వచ్చెను. మరల సత్యమును గ్రహింప శక్తుడుకావలెనన్న స్వకల్పనలను, స్వవివేకమును, విడనాడి ప్రజ్ఞాదేవత తనయందు పనిచేయుట కవకాశమియ్యవలెను. యావజ్జన్మము కష్టపడి యార్జించిన ద్రవ్యమును త్యజింపుమని లోభికి చెప్పవచ్చును కాని తమవక్రమార్గములను విడువుడని భౌతికులకు చెప్పనలవి కాదు. ఏలాగైన, నొకగుప్తసమాజమును స్థాపించవలెనని నీవాలోచించినట్లు తోచుచున్నది. నేనిచ్చెడి హెచ్చరికను జ్ఞాపకముంచుకొని నీవా పనికి పూనుకొనుము. ఆసంఘమునకు వట్టి బుద్ధిమంతులను, కుయుక్తిపరులను, దంభాచారులను, ఆత్మనైపుణ్యగర్వితులను, ఆశాపరు

లను, శాస్త్రవాసనలత్పప్తికొరకు రహస్యములను గను గొన యత్నించువారిని, స్వార్థనిమిత్తము రహస్యముల ను బ్రయోగముచేయువారిని జేర్చుకొనరాదు. ఏలయన, ఆ కార్యముచే నీ కెంతయు నుత్తరవాదిత్వమున్నది. "ఎవరికికలదో వారికి సమృద్ధిగా నివ్వబడును. ఎవరికిలేదో వారి కున్న స్వల్పముకూడ నపహరింపబడును" అనునీతి వాక్యమును నీవు వినియున్నావు కదా?

పథికుడు:—ఆవాక్యమును నేను చదివియున్నాను కాని దాని యర్థము నాకిదివరకు చక్కగా బోధపడి యుండలేదు.

తారకసాధువు:—ఎవరికి జ్ఞానమందభిరుచి యున్నదో వారికి కావలసినంత జ్ఞానమివ్వబడును. ఎవరియందు స్వార్థాపేక్షయే యధికమై జ్ఞానాసక్తిలేదో వారికున్న స్వల్ప జ్ఞానము సహిత మపహరింపబడుచున్నది.

పథికుడు:—యోగమునభ్యసించుటకై యొకసమాజము నుగాని లేక యొకవిద్యాశాలను గాని యేర్పరచి దానిలో జేరినవారు భ్రాంతిసిద్ధములగు ప్రాపంచికవ్య వహారములకు చిక్కక, శాశ్వత విషయమందే తమ

శక్తులను వినియోగము జేయునట్లు నియమించవలెనని నామనస్సునకు తోచియుండుట నిజమే కాని దానికి తగిన నిర్జనప్రదేశమెచ్చట కలదో తెలియజాలక యున్నాను. ఆమందిరము ప్రకృతియొక్క ఘనగంభీరములతో గూడి యుండు నిశ్శబ్దస్థలములో నిర్మించదల చినాను. అచ్చట నివసించువారలు కల్పితనియమములకులోబడక జీవన్ముక్తి మార్గమున నడచునాశగలవారై యుండవలెనని సంకల్పించికొని యున్నాను. విద్యావిహీనులను, పామరులను దానిలో జేర్చుకొన నిష్టములేదు.

తారకసాధువు—మొదలే నిష్కర్ష జేసికొనియున్న యభిప్రాయములు గలవారిని, ద్వేషబుద్ధిగల వారిని స్వార్థనిమిత్తము జ్ఞానము నపేక్షించువారిని విడిచి పెట్టి శక్తిమంతులను, నీతి మంతులను, లోకసేవకై జ్ఞానమును సంపాదించు వారిని మీాశాలలో జేర్చుకొనవలెను. ఇట్టి వారు దొరుకుట దుర్లభమే కాని యాకస్మికముగా నెవరైనను దొరికి నీయుద్యమమున భాగులై యుండ నిచ్ఛయించిన లోకమందు మీాసంఘము త్వరలో నుత్కృష్టదశకు వచ్చును. మానవుల

కాత్మశక్తిని వికాసము జేసికొను నుపాయము తెలి యదుకాన నత్యల్పమైన బాహ్యజ్ఞానమును సంపాదించుటకు వారు చాలక్లేశములచే లభ్యమగు విద్యా పద్ధతిని గల్పించియున్నారు. మా మార్గమాచరణకు వచ్చిన బాహ్య జ్ఞానమునకు బదులుగ నాంతరంగిక జ్ఞానము మూఢనమ్మకమునకు మారుగా నిశ్చయజ్ఞానము, శాస్త్రసిద్ధాంతమునకు బదులుగా నాత్మసాక్షాత్కారము, మాఢ్యమునకు మారుగా శ్రద్ధయు, బుట్టును. నీవు యోచించి యుండు మందిరనివాసులు నిర్మల మనస్సుగల స్త్రీపురుషులుగాను, పరమార్థ జ్ఞానమును నిష్కలంకముగా బ్రకాశింపజేయు సజీవ దర్పణములుగాను, పరిణమించిన నీ మఠము లోకోత్తర భూషణమైయుండును. అట్టి జ్ఞానప్రదీప నాకేంద్రములు మానసికలోకమందు జ్యోతిర్మయ మండలములవలె ప్రకాశించును. అట్టి సమాజమొకటి యుండినను లోకము నంతటిని మన జ్యోతిచే వెలిగించును కాన దాని కిరణము లన్నిదిశలయందును గోచరించగలవు.

పథికుడు—ఇట్టి యోగాలయమును స్థాపించుట కేమి ప్రతిబంధకమున్నది?

తారకసాధువు—నరులలో నుండు లోపములు పలువిధములైన స్వార్థాపేక్షలు తప్ప మరియే ప్రతిబంధకములు లేవు. ఆత్మ సాక్షాత్కారమునకు, నమరత్వసిద్ధికిని మానవుని యంతస్స్వభావము, వాని బాహ్య విద్యమానములు నను రెండుస్థలముల నుండి విఘ్నములు వచ్చుచున్నవి. మనుష్యుడు శాస్త్రముల నుండియు, మతమునుండియు కొన్ని దురభిప్రాయములను సంపాదించి తన్ను నాక్షేపించు వారిని ద్వేషించుచున్నాడు. వాని పశుస్వభావమందు హీనములగు భూతవ్యక్తులు చేరి విఘ్నముల నాచరించుచున్నవి. ఆవ్యక్తులు బాహ్యకార్యములవలన పుష్టి కావలెను కాన మానవులకు తమ వాసనల నేకలుగ జేయుచు నానారూపములుగా జీవించుచున్నవి. అవి మనస్సుతో మిళితమైనపుడు, ఆశ, దంభము, లోభము, అసహనము, స్వార్థత మొదలగు దుర్గుణములుగా బరిణమించుచున్నవి. ఈప్రతి భూతవ్యక్తియు మతిహీనమైన కుహనాజీవియై పెరుగుచు మనుష్యునియందు వేరొక యాత్మను గల్పించును. కల్పితాత్మ లనేకములు నరుని యందు ప్రబలమై యెద్దియో యొకటి కాలక్రమమున సత్యాత్ముని రాజ్యము నాక్రమించును. అప్పుడది

మానవుని ప్రాణప్రజ్ఞలను నిర్మూలము గావించును. ప్రపంచమంతయు మానవ రూపముతో నున్న యట్టి భూతవ్యక్తులతోను, కించిద్జ్ఞానముగల భూత సముదాయముతోను నిండియున్నది. వాని య వాంతరములో వివేకమునకే స్థానభ్రంశము కలిగి యున్నది. వివేక శూన్యులైన బుద్ధిమంతులను ప్రసంగ వేదికలలోను, విద్యానిలయములలోను, ప్రతి దినము చూడవచ్చును. అట్టి అత్యాచారులు తనమ నోరాజ్యమును నాక్రమణము చేయకుండులాగున మనుష్యుడు జాగరూకుడై యుండవలెను. లేనియెడల వివేకరాజుయొక్క ప్రభుత్వమునకే ప్రతిబంధకము కలుగును. మనోదేహములకు సంబంధించిన యాహీ నభూతములతో జక్కగా బోరాడి వానిని వివేక ప్రభు వుకు స్వాధీనము చేసిన యెడల, మానవుని ధర్మము సాంగమగు చున్నది. మనశక్తుల నన్నిటిని బాహ్యాలో కమందే వినియోగపరచుచుండిన మనమా ధర్మము ను నిర్వహింపగలమా? విషయ సుఖములయందును బాహ్య జ్ఞానమునకు సాధన భూతమైన భౌతిక శాస్త్రా భ్యాస మందును మగ్నులై యాత్మనిష్ఠ లేక భ్రాంతి

పరాయణులై యున్నయెడల మనము మనకర్తవ్యమును నిర్వహించుటెట్లు? మన యావచ్ఛక్తిని బాహ్యవ్యాపారములను పరిధియందే వినియోగపరచిన కేంద్రస్థానములో నున్న మనయందు దానిని సేకరించ గలమా? శక్తిని బాడుచేయుచు నది నిలువలేదని విలపించిన ప్రయోజనమేమి?

షష్ఠాధ్యాయము సంపూర్ణము.

---

# సిద్ధాశ్రమము.

## సప్తమాధ్యాయము.

---

### పరానిష్ఠ.

సిద్ధాశ్రమమును దర్శించుటకు పూర్వ మాత్మ విద్యావిచారమందును, యోగవిషయమందును, పథికు నకుత్తమాభిప్రాయ ముండలేదు. వాని నభ్యసించు వారు "గగనాంతః పురములను నిర్మించు" భ్రాంతుల వలెనుందురనియు, వారికి మిథ్యాచారము, మూఢనమ్మ కము తప్ప మానవయోగ్యములైన మరి యే సద్గుణము లుండవనియు వాడు తలచియుండెను. రమ్యమగు యానిర్జన ప్రదేశమందు నివసించుచు, భ్రాంతి సిద్ధములైన నైహిక వినోదములను ద్యజించి సర్వదా యుత్తమ నిష్ఠలోనే కాలయాపనము జేయుచున్న యాయోగబృందమును జూడగనే వాని పూర్వాభిప్రాయము తలక్రిందులా యెను. ఆత్మవిద్యయు, యోగవిద్యయు విధిబద్ధములై యున్నవనియు స్వాశ్రయశక్తి లేకున్న వానిని సాధిం

చుట కష్టమనియు వానికి స్ఫురించెను. అపరిచితములగు నాయుభయవిద్యల విషయమై మరికొన్ని సంగతులను దెలిసికొని పోవుట మంచిదని వాడాలోచించుచుండ తారకసాధువు దానిని గ్రహించి మరల చెప్పసాగెను.

తారకసాధువు.—రాజ్య పరిపాలనాధర్మమును విడనాడి వెళ్లిపోయిన రాజువలె మానవులు తమ స్వస్థానమును విడిచి బహుదూరము వెళ్లియున్నారు. అందుచే వారి రాష్ట్రమన్యులయధికారమునకులోబడియున్నది. మరల తమరాష్ట్రమునకు వెళ్లిపూర్వమువలె రాజ్యభారమును వహింపదలచిన యెడల దానినాక్రమించియున్న శత్రువులతో బోరాడి వారిని జయించక తప్పదు. తమ శత్రువులను జయించుకొరకు మానవులు తమంతట తామే నుద్యమించని యెడల నా పనిని ప్రకృతికాలక్రమమున వారితోనే చేయించుచున్నది. సంభావితుల కది శ్రేయస్కరముకాదు కావున నా యుద్ధకార్యమును వారెంతత్వరగా ప్రారంభించిన నంతక్షేమకరము. స్వస్థానచ్యుతి కలిగియున్నందున బాహ్య ప్రపంచముయొక్క విషయవిలోభము లింద్రియములద్వారా వారిని ముట్టడి వేయుచున్నవి. ఈ

విషయ విలోభము లాసన్నమైయుండ మానవుల స్వభావమందుండు పశుభూతములకు చైతన్యము కలుగుచుండును. పశుభూతముల కెంతశక్తియుండునో వాని నిగ్రహముచేయుటలో మానవుల కంత శక్తి యధికమగుచున్నది. మానవులు తమయందున్న పశుభూతములతో ఘోరసంగ్రామమును జేయకతప్పదు. అట్లుచేసి తమ శత్రుభూతములను నిపాతమొనరించువారే ధీరులు. గౌతమబుద్ధు డట్టి ధీరపురుషుడైయుండెను. జ్ఞానమనెడి యశ్వత్థవృక్షముక్రింద స్థిరముగానుండినందున తన పశుగుణములతో పోరాడి వానిని జయించెను.

మిత్రుడా! దేవుడు తన సంకల్పముచే నీ జగమును సృజించెనని ఋషులు చెప్పెదరు. సృష్టికారంభించి నపుడతడు మూడురూపములనుధరించును. ఈ యంశమన్ని మతములలోను ప్రతిపాదింపబడి యున్నది. మొదట ఇచ్ఛపుట్టుచున్నది. ఇచ్ఛనుండి తలంపుగలుగుచున్నది. తలంపునుండి కార్యరూపమగు దృశ్యప్రపంచ ముద్భవించుచున్నది. ఇదియే సృష్టివిధానము.

పథికుడు:—తొమ్మిది సెలవిచ్చినదానిలో తలంపువలన దృగ్గోచరమగు ప్రపంచము పుట్టెనని యర్థమగుచున్నది. తలంపును దృశ్యమగునట్లు చేయుపదార్థము దేవుని కెచ్చట లభించెను ?

తారకసాధువు:—ఆ పదార్థము దేవునియందేయున్నది. "అల్లాఇల్అల్లా" యని మహమ్మదీయులు చెప్పుదురు. దాని యర్థమేమన:—దేవుడనన్యుడు. అతని నుండి జడము, స్పందము, దేశము, ప్రజ్ఞ, బుద్ధి, వివేకము, ఆత్మ, పదార్థము, శక్తి, అంధకారము, ప్రకాశము మొదలగు సమస్తమును పుట్టుచున్నవి. సర్వము నతడే, అతని విడిచి యన్య మేదియు లేదు. ప్రపంచములన్నియు నతని సంకల్ప రూపములే. సర్వము తానైయున్న యతనిలో సర్వముచేరి యున్నది. సమస్త పదార్థములకు నతడు ప్రాణదాయకుడై, యాత్మ స్వరూపుడై యున్నాడు. మనముజీవించుచు, జలించుచు, స్థితిగలిగియుండుట యతనియందే. ఆతనివిడిచి మనకుస్వతంత్రస్థితిలేదు. ఈశ్వరాంశభూతుడైన నరుడు తన దేహప్రపంచము నకు తానే దేవుడై సృష్టికారకుడైయున్నాడు.తనహృ

దయమందున్న ప్రజ్ఞయనెడి కేంద్రమునకంత శ్శక్తిచే సం కల్పములను బంపినయెడల దేవునియందు నడచువ్యాపా రము మానవునియందు నడచుచున్నది. బాహ్యప్రపంచ ము పరిధికి సంబంధించిన కార్యముకాన దాని పరిణామ మునకు కేంద్రపరాఙ్ముఖబలమును (Centripetel force) ప్రయోగించుట యావశ్యకము. కేంద్రోన్ముఖబలము (Centrifagal force) మనసుకు సంబంధించిన యాంత రంగికశక్తియై కేంద్రస్థాన సమీపమందుండును కాన నది సృష్టిముఖ శక్తిగాలేదు. కేంద్రాభిముఖశక్తి కేంద్ర మును సమీపించగానే ప్రబలతరమైన ప్రతిబంధకము లేవైనను ఘటించినయెడల నది వెనుకకు మరలి పరి ధికి వచ్చి యచ్చటనే పనిచేయనారంభించును. అప్పు డది సంకల్పశక్తి యనిపించుకొనును. ఇది యాత్మకు సంబంధించిన యొకశక్తి విశేషమై యున్నది. ఇది ప్రకృతిపురుషులకును సృష్టస్రష్టకును, ఈశ్వరజగత్తుల కును, మధ్యభాగమందున్న పరికరమైయున్నది. ఇచ్ఛ యనెడు కేంద్రాభి ముఖశక్తితో నాలోచన యనెడు కేంద్రపరాఙ్ముఖ శక్తిచేరిన కార్యాభిముఖమైన యాత్మ ప్రజ్ఞయుదయించును.

మిత్రుడా! నీమనశ్శక్తిని పరిధి వంక పోనియ్యక నిగ్రహించి కేంద్రము వైపుత్రిప్పిన కేంద్రస్థానమందున్న ప్రతిబంధకములవలన ప్రతిక్రియలు (Reactions) తటస్థమగుచున్నవి. కేంద్రాభిముఖశక్తి యెంతయధికముగానున్న నది పరిధి కభిముఖమైనపు డంత ప్రబలముగా సృష్టికార్యము జరుగుచున్నది. దీనిచే నీయాత్మకు శక్తి యధికమగుచున్నదని యర్థము. ఆత్మ శక్తివంతుడైన కొల్ల వానియదృశ్యదేహములకు సంబంధించిన పదార్థము స్థూలదేహమం దంతటను వ్యాపించి దాని నుత్కృష్ట శరీరముగా మార్చుచున్నది. రానురాను నేకాత్మభావమే ప్రబలమై (స్థూల) దేహాభావము నశించును. అట్టి శక్తి కలుగుటకు మునుపు నీయాత్మశక్తిని జడపదార్థముపై ప్రయోగించు సామర్థ్యము నీకు కలిగియుండును కాన నీరోగములను, పరులవ్యాధులను బోగొట్టుటకును దూరదేశములయందు మహత్తులను జరుపుటకును సమరుడవగుచున్నావు. స్థూలదేహముయొక్క పరిమితిచే నాత్మయొక్క కార్యశక్తి క్లుప్తముకానేరదు. మనస్సమష్టిస్వరూపుడగు బ్రహ్మపర్యంతము ఆత్మయొక్క కార్యశక్తి వ్యాపించగలదని గ్రహించుము.

పథికుడు.—ఈవిషయము లుత్కృష్టములుకాన నాకు సంపూర్ణముగా నర్థము కాలేదు. మననముచేసి ముందు తెలిసికొన యత్నించెదను.

తారకసాధువు.—అదిమంచిపని. అవి నీకు జ్ఞాపకముండు లాగున నేను సహాయము చేయుచున్నాను.

పథికుడు.—పెద్ద లుపదేశించిన యీవిషయములు సత్యములని నాకు తోచుచున్నది. ఆధునికులు తప్పుత్రోవలో బోవుచున్నారని నేను రూఢిగ జెప్పగలను. ఏలయన, బాహ్యప్రపంచమందు ప్రాణమె ట్లభివ్యాప్తమైయున్నదో దానిని మాత్రమే ఆధునికులు విచారించుచున్నారు. కాని ఆత్మలో దటస్థించు దానిని విచారించరు.

తారకసాధువు.—నీమాటసత్యమే. ఇప్పటి విచారపరులు స్వకల్పిత భ్రాంతులచేతనే నశించెదరు కాబోలు! "ప్రాపంచికుల వివేకమార్గములు పారమార్థికులకు యవివేకములై గోచరించుచున్నవి" అని బైబిల్‌లో వ్రాయబడినమాట యథార్థమైయున్నది.

జగత్తులో నడచుచుండు విధిచోదిత వ్యాపారము లనే సదాచింతించుచుండిన నేమి ప్రయోజనము? ప్రపంచ మేక్షణమందో మన దృష్టిపథమునుండి యదృశ్యమగును. దానిలో ఘటించుకార్యములు మనస్మృతినుండి తొలగి పోవుచున్నవి. ఇట్లుండగా, దానిలో దటస్థము లగు ఘటనావళులనే పరివిధములుగా విచారించుచుండిన నేమిప్రయోజనము? ఇప్పటి విద్యావంతులకు భౌతికసిద్ధాంతముల జ్ఞానముకంటె నాత్మజ్ఞానమున్న యెడల చాల లాభకరముగా నుండును. యుక్తిని బ్రదర్శించు సిద్ధాంతముల కంటె ననుభవజన్యజ్ఞానము శ్రేష్ఠమైనది. ఆఫ్రికాదేశ మందున్న కొన్ని జాతుల కోతు లేలాగుపుట్టినవి, వాని స్వభావమేమి యను సంగతులను తెలిసికొనుటకై కాల శక్తులను వినియోగించుటకంటె నాత్మరాజ్యముయొక్క వ్యాపారములను గనుగొన యత్నించిన చాలప్రయోజన ముకలదు. విషవర్ధకమైన రసిని నూతనవిధములపాలను దేహమునుజేర్చి రోగమును నివారించు విధానమును గని పెట్టుటకంటె హస్తస్పర్శమాత్రమున సమస్తవ్యాధులను బోగొట్టుప్రయోగమును గనుగొనయత్నించిన మంచిది కదా? కొందరు వ్యర్థముగా బనిచేయుచున్నారు. కొందర నారోగ్యము నధికము చేయుచున్నారు. కొందరు

సత్యమునకు బదులుగ ననత్యమును బోధించుచున్నారు. కొందఱు ప్రయోజనకరమైన దానినివిడిచి నిష్ప్రయోజనమైనదానిని కనిపెట్టుచున్నారు. కొందరు ధనసంచయము కొరకును, కొందరు విషయసుఖముల కొరకును, మరికొందరు తమప్రాశస్త్యము కొరకును పనిచేయుచున్నారు.

బాహ్యప్రపంచమున కలుగు ప్రతిబంధకములకును, అంతరంగిక ప్రపంచమునుండి తటస్థములగు నాటంకములకును పరస్పరసంబంధము గలదు. వానిని భిన్నముజేయ నలవికాదు. బాహ్యవిలోభములవలన యాంతరంగికాపేక్షలు పుట్టుచున్నవి. అంతరంగికాపేక్షలవలన వానిని బొందుటకు తగినబాహ్యోపపత్తులు తటస్థమగుచున్నవి. అనేకులు భ్రాంతిసిద్ధములైన తుచ్ఛసుఖములనుగూర్చి అంతశ్రద్ధగా నపేక్షించరుకాని వానిని దృణీకరించు సామర్థ్యములేక కష్టపడుచున్నారు. ఏలాగైనను, పారమార్థికస్థితినిబొంది జరామరణములులేనివారై యుండవలెనని యనేకులపేక్షించుచున్నారు. కాని శక్తిజ్ఞానములను ముత్యములను సంపాదించునిమిత్త మాత్మసముద్రమందు మునుగుటకు తమకాలమును వినియోగించక నిరర్థకకా

ర్యములకు వినియోగము చేసెదరు. సంఘనియమములు, విరుద్ధపద్ధతులు, మాధ్యసంప్రదాయములు తమకహేతుకములైన సంకెళ్లుగా నేర్పడియున్నవని తెలిసికొనియున్నను వానినిభేదించికొని బయటరాగల సాహసము లేక కొందరు దుఃఖపడుచున్నారు. అట్టివారికి సత్యమును సాధించు నిమిత్తము శక్తికాలములు చాలక చాలవ్యథ కలుగుచున్నది.

వ్యర్థములైన మతపద్ధతులను విడనాడి మూఢుల తిరస్కారమును, అల్పమతుల పరిహాసములను, అవివేకుల కుత్సితమును లక్ష్యముచేయక అంధకారమందున్న వారి కగోచరమైన జ్ఞానజ్యోతినిబొంద ధైర్యసాహసములను జూపువా రెందరున్నారు? శోధించిచూచిన, వివేకవాక్కును మరుగుచేసి యవివేకులతోజేరి గంతులువేయువారే యనేకులున్నారు. అహంకార మమకారములను విడుచుటకంటె నాత్మవస్తువును పస్తుపెట్టుట మంచిదని యనేకులు భావించియున్నారు. తమ యహంకారమునకు భంగమును గలుగజేయు సందర్భములు తటస్థించెనేని వానిని సర్వథాపరిగ్రహించరు. బంధమునే స్వతంత్రమని తలచి తమస్థితిని గొనియాడెదరు.

మానవుని స్వభావము చెడ్డదని నేను చెప్పనుకాని వానిస్వభావమందు హీనములగు పశుగుణములుచేరి తాము జీవించి యుండుటకై వానిపరానిష్ఠకు భంగమును గలుగజేయుచుండుట యథార్థమే. వానియందుత్కృష్ట తత్వము ప్రకాశమునకు రావలెనన్న వాడు తన పశుగుణములను నాశముచేయవలెను. తన స్వస్థానమునకు వెళ్ల దలచిన నరుడుత్తమస్వభావమును వృద్ధిపరచికొనవలెను. ఇది సులభమైన పనికాదు కాని పూనికతో యత్నించిన సాధ్యమగుచున్నది. స్వస్థానమునకు వెళ్లవలెనను యపేక్ష మాత్రముండి దానిని సాధించకపోయిన నది యెవరితప్పు? మనుజునియందు సమస్తబీజములు పెరుగుట కవకాశమున్నది? తాను కోరినప్రకారమువాడు పంది, పులి, సురుడు, అసురుడు, తపస్వి, యవివేకి కాగలడు.

మిత్రుడా! నవనాగరీకతయాధునికులను నెక్కువగా బాహ్యసుఖములలో ప్రవేశపెట్టుచున్నది కాన లోకమందుపరమపదమార్గము నష్టమైపోయినది. జలాశయమందు పడి తన గమ్యస్థానమును నెరుగజాలక తనప్రాణములను బ్రతికించుకొను నిమిత్తమీాగట్టునుండి యాగట్టుకు విలవిలలాడుచు బోవుచున్న పురుగువలె నవనాగరీకులున్నా

రని చెప్పవచ్చును. ప్రపంచమునకు నానావిధములైన చెడుగులు, అరిష్టములు వారియజ్ఞానమువలన తటస్థమగుచున్నవి. ఆయజ్ఞానమును బోగొట్టుటకై మతములు, శాస్త్రములు పనిచేయకున్న యవి నిరర్థకము లగుచున్నవి. అజ్ఞానము, దురభిమానము పరస్పర సాపేక్షములుగానున్నవి కాన ప్రాజ్ఞులను జూచిన అజ్ఞులకు ద్వేషము కలుగుచున్నది. గమ్యస్థానమందే లక్ష్యమునుంచుకొని దానికి గొనిపోవు మార్గమునందే వెళ్లుచు బంధకములైన సంప్రదాయములను ధిక్కరించి నడచిన మనుజు డిప్పుడు స్వమతస్థులలో నిరుపాధికముగా జీవించగలడా? ఇప్పటి విద్యావంతులు శృంఖలములతో బెరిగియుండుటచేత స్వాభావిక స్వాతంత్ర్యమును ద్వేషించుచున్నారు. వీరి సంసర్గమందు సత్యమార్గప్రవర్తకులకు పరిణామములేదు. అడుగడుకుకు సత్యానుయాయుల కజ్ఞులవల్లను, విద్యావంతుల వల్లను, బాధకమువచ్చుచున్నది. ఆత్మజ్ఞానము లేని విద్యావంతులను అజ్ఞులనియే పిలువవచ్చును. అజ్ఞుడుండు చోట వాని లోపములు సిద్ధముగానుండును. అజ్ఞానమను మహారాజ్ఞికి సంశయాసూయాభయము లంగరక్షకులై యున్నవి. ధరణియందున్న పురుగుల స్వభావమును గనుగొన యత్నించుటకంటె నజ్ఞానపిశాచమును బార

దోలి పరానిష్ఠయొక్క ప్రభావమును దెలిసికొన యత్నించిన లోకమునకు చాల మేలగును.

ఒకరిచే నసాధ్యమగు కార్యము ననేకులు చేరిచేసిన సాధ్యమగును. ప్రపంచముయొక్క విదూషక స్థితినుండి నివృత్తులై సంప్రదాయ బద్ధములైన యవివేక మార్గము లను విడిచి, మనస్సామరస్యమును గలుగజేసికొని పరానిష్ఠలో నుండుటకు తీర్మానించికొని యున్నవారు కొందరొకచోట చేరి యభ్యుదయపథమును సాధించిన నది నిస్సంశయముగా చేకూరును. ఆత్మపథమందు నడచు వారికి పరస్పరసహాయ మావశ్యకము. పైసోపానము లయందున్నవారికి క్రిందసోపానముల యందుండు వారి సహాయము, క్రిందసోపానముల యందున్న వారికి పైసోపానముల యందుండువారి సహాయము. మధ్యసోపానములయందున్న వారి కుభయుల సహాయముమత్యావశ్యకము.

ఈ రహస్యము నెరిగియే ఆత్మపథమున నడచువారి హితముకొరకు పూర్వమందచ్చటచ్చట మఠములు స్థాపింపబడియుండెను. అవి యిప్పటికిని గలవు. ఆ మఠ

ములలో నున్నవారు సర్వదాపరానిష్ఠయందే యుండవలె నని నియమమున్నది. ఇటీవల కొన్నిమఠములు చెడిపోయి యున్నను వానిని స్థాపించిన యుద్దేశముమాత్రము చాల మంచిది.

ఎన్నిమఠములను స్థాపించినను లోకహితమగు యాచరణములోనుండుట యావశ్యకము. అహంకారమమకారములను విడిచి, లోకాభ్యుదయమే ముఖ్యమని తలచి, నిష్కళంకములైన ధ్యాన ధారణ నిష్ఠల నభ్యసించుచు, దృశ్యాదృశ్యముగా లోకమునకు మేలొనరించుటయే "పరానిష్ఠ".

పథికుడు:—నేను యోచించియున్న పారమార్థికసమాజము సాధ్యమగునేని, పరానిష్ఠమార్గమును, స్వభావరహస్యములను బోధించుటకు తమరు సమ్మతించెదరా?

తారకసాధువు:—జగత్తులో దేనికిని కొదవలేదు. ఎచ్చట నేమి యావశ్యకమో యచ్చటనది సిద్ధముగానుండును.

సప్తమాధ్యాయము సంపూర్ణము.

---

# సిద్ధాశ్రమము.

## అష్టమాధ్యాయము.

---

### వామాచారము.

పథికునకభేద్యమైన రజితఘంటారవము మరల విన బడెను. తనకు వేరేయొక పనియుండుటచేత దాని నిమిత్తము తాను పోయి వచ్చువరకచ్చటనే యుండుమని పథికునికి నియమించి తారకసాధువు వెళ్లిపోయెను. రహస్య సంకేతముల యమూల్యగ్రంథమును పథికుడు చూడ నారంభించెను. పంచకోణా కృతిగల సాంకేతిక చిత్ర మొకటి వాని మనస్సును సంపూర్ణముగా నాకర్షించెను. దాని యడుగు భాగమున నున్న త్రికోణ ద్వయమునకు శిరములు పైకి లేచియుండెను. ఆచిత్రమును జూచుచు దానియందే మనోలయమును జేసికొని యుండగా కుర్చీయొక్క వెనుకభాగమునుండి యొక ధ్వని వినబడెను. "ఆసంకేతమందు అనంతము - కాలము, దేవుడు-మనుష్యుడు, సురుడు-అసురుడు, స్వర్గము-నరకము నిరూపింపబడియున్నవి" అని యాధ్వని పలికెను.

కంపితుడై పథికుడు తిరిగి చూచెను. సన్యాసి వేష ముతో నున్న యొక పురుషుడు గోచరించెను. అతని ముఖమందు బుద్ధి కౌశల్యమును జూపించు చిహ్నము లుండెను. అనన్యమనస్కుడై చిత్రములను జూచుచుండగా దానికి తాను విఘ్నము చేసినందుకై క్షమింపు మని పథికుని నతడు వేడుకొనెను. అతడాస్థలమున కెపుడు వచ్చెనో వానికి తెలియలేదు. అది తనచిత్తైకాగ్రత యొక్కఫలమని వాడు భావించెను.

ఆ సాధుపురుషుని వికసించిన ముఖము, మనోహరమైనదృష్టి, బుద్ధికౌశల్యభావము, పథికుని మనస్సులో నాంతరంగికవిశ్వాసమును గలుగజేసెను. "తమరెవరు"? అని వినయపూర్వకముగా బ్రశ్నించెను.

సాధువు:—నేను తారకసాధువునకు శిష్యుడను. అతడు నిద్రించుకాలమున నతని కార్యమును నేను చేయుచున్నానుకాన నన్నతని బుద్ధితత్వమని పరిహాసము నకై పిలిచెదరు.

ముఖమున పరిహాసభావమును బ్రదర్శించుచు

మాటలాడినందున పథికు డాభావమునే వెల్లడిచేయుచు నిట్లు పలికెను:

పథికుడు:—తమరతని బుద్ధితత్వమైతే యతని సంకల్పముచేగలిగిన భూతవ్యక్తిగానుండవలెను. ఈ యాశ్రమమున నేను వింతవింతలైన ఘటనావళులను జూచియుండుటచే దమరు నాయెదుట నంతర్ధానమైనను లేక పిశాచమువలె గోచరించినను నేను విస్మితుడను కాజాలను.

సాధువు:—దృశ్యములగు బాహ్యావస్తువులు సంకల్పముచే బుట్టియుండుట నిశ్చయమే. పరానిష్ఠలో నున్నవారికి కార్యమున కనుకూలమైన శరీరమును గల్పించికొను సామర్థ్యముండును. మూఢులను భ్రాంతిగొలుపుటకై పిశాచములు సహితము కొన్ని కొన్ని వేళలలో సాధువేషమును ధరించుటకలదు. మతిహీనులైన కపటభక్తులను మోసపుచ్చుటకు కుటిలభావములుగల స్వభావవ్యక్తులు కొన్ని (Nature Spirits) భక్తుల యిష్టదేవతా రూపములను ధరించుచుండుట నేనెరుగుదును. ఆ వ్యక్తులు తాముచేయు

సాహస కార్యములతో జరితార్థములగుచున్నవి. నేన ట్టి స్వభావవ్యక్తినికాను, పిశాచముకాను. నీవట్టిమతి హీనుడవుకావు, కపటపురుషుడవు కావు.

తన విషయమై సాధుపురుషుడు వెల్లడిచేసిన మంచి యభిప్రాయమునకై పథికుడు హర్షించెను. ప్రథమ దర్శనమందే మనుష్యుల గుణావగుణములను గని పెట్టుశక్తి తనకున్నదని యీ సాధుపురుషు డభిప్రాయ పడియుండుటచే నతనికి మరల సంశయము రాకయుండులాగున తానువర్తించవలెనని పథికుడు తీర్మానించికొనెను. ఇదిగాక, సాధుపురుషుని దృష్టిలో కరుణారస ముండినందున నతనివిషయమై తా నవిశ్వాసిగానుండుట యనీతి యని భావించెను. అతని కభివందనముచేసి యిట్లు చెప్పసాగెను:

పథికుడు:—గౌరవాస్పదములైన తమయుద్దేశములలో నాకెట్టి సంశయములేదు. తమరు నా విశ్వాసమున కర్హులైన మార్గప్రదర్శకులని నేను నమ్మియున్నాను.

సాధువు:—మార్గదర్శకులను నేర్పరచికొను విషయమం దెల్లరు జాగరూకులై యుండ నవసరమే. ఈ

కాలమందు కపట సాధువులు మితిలేకయున్నారు. కామలోకము యొక్క రహస్యములను దెలిసికొన వలయునని లోకమంతయు దల్లడిల్లుచున్నది. తుచ్ఛములగు యక్షిణీమాయలలో జనులకు శ్రద్ధయెక్కువగానున్నది. అపక్వదశలో నున్నవారికి గోచరించక యుండులాగున గోప్యముగా నుంచబడిన సంగతులన్నియు బహిరంగముగ జాటింపబడుచున్నవి! కొన్ని స్థలములయందు విక్రయపదార్థములవలె నవి యంగళ్లలో నుంచబడియున్నవి. గురుభావము నారోపించికొని యున్న కొందరు తమ శిష్యుల స్వార్థతతోను, ఆశలతోను బేరమాడుచు నంధులను నడపించు నంధులవలె దుఃఖభాజనులై యున్నారు. సత్యాన్వేషులందరును నీవలె నున్నయెడల జీవన్ముక్తిదశను గరతలామలక మగునట్లు చేసెదమని యభయహస్తమునిచ్చు కపటగురువుల మాటలను విశ్వసింపరు.

పథికుడు:——నా పరిశుద్ధాంతః కరణమును, స్వార్థరహితమైన యుద్దేశమును తమరు కనుగొనినందుకై నేను చాల బాధ్యుడనై యున్నాను. నాయోగ్యత సన్మానా

ర్హమై యున్నదని తమకు తోచియున్నందున నిం
కను కొన్ని రహస్యములను నాకు దయచేసి చూపిం
చవేడెద. తారకసాధువు తమ దీర్ఘప్రసంగములచే
ననేక సంగతులను నాకు సెలవిచ్చియున్నారు. ఇంక
ను కొన్ని రహస్యములను బ్రత్యక్షముగాజూడ నపే
క్షించుచున్నాను. సాధ్యమగునేని, కొన్నియోగ
సిద్ధులను బ్రయోగింప నేర్చుకొనదలచినాను.

సాధువు:—— స్వార్థరాహిత్యముచే నీవు మహనీయుల
యనుగ్రహమునకు పాత్రుడవైయున్నావుకాన నా
శక్తికొలది నీకు సహాయముచేయ నెట్టి యభ్యం
తరములేదు.

ఇట్లు పలికి శుద్ధీకరణాలయములోని కొన్ని వింతలను
జూపించెను. వానిలో గొన్నిటిని వాడు గ్రంథములమూ
లమున దెలిసికొని యుండెను. మరికొన్ని నూతనములై
యుండెను. తరువాత వారిరువురును నొక పవిత్రమైన
మందిరమునకు వచ్చిరి. దాని తలుపులు మూయబడి
యుండెను. దానిలో నేమియున్నదని పథికుడు ప్రశ్నిం
చెను.

సాధువు:—కొన్ని చూర్ణము లీమందిర మందున్నవి. వాని ధూపమువలన జగమందున్న భూతవ్యక్తులు గోచరమగును.

పథికుడు:—మనోహరములగు భూతవ్యక్తుల విషయమును నేను చదివియున్నానుకాని వాని నెన్నడును జూడ లేదు. ఇపుడుచూడ నపేక్షించుచున్నాను.

సాధువు:—భూతవ్యక్తులన్నియు మనోహరములుగ నున్న వని భావించకుము. వానిలో గొన్ని పృథ్వీతత్వము నకు సంబంధించియున్నవి. వానికి మనుష్యశరీరము వలె శరీరములున్నను అవి బహుసూక్ష్మముగనుండు ను. తమకిచ్ఛకలిగినపు డవి తమశరీరములను బెద్దవి గా జేసికొనగలవు. అవి మిక్కిలి కుటిలస్వభావముగల వ్యక్తులై యున్నవి. కొన్నివేళలలో నవి మానవుల స్నేహము నతి శీఘ్రముగ సంపాదించి వారలకు భూ గతములై యున్న నిధినిక్షేపములను జూపించుట కలదు కాని మనుష్యులు వాని జోలికి పోకయుండు ట క్షేమకరము. మరికొన్ని వాయుతత్వమునకు సం బంధించిన వ్యక్తులై యున్నవి. అవి పృథివీవ్యక్తుల

కంటె నెక్కువప్రీతిని జూపు స్వభావము గలవైయున్నను వాని ప్రీతి విశ్వాసార్హము కాదు. మూడవ తరగతికి చేరిన భూతవ్యక్తు లగ్నితత్వమునకు సంబంధించియున్నవి. వానికి వికారమైన రూపమున్నది. వాని సంపర్కము లేకయుండుట మనుష్యులకు క్షేమకరము. జలతత్వమున నివసించు వ్యక్తులు మనోహర ప్రాణులై యున్నవి. అవి మానవులతో విశేషస్నేహమును గలిగియుండును.

పథికుడు:—సముద్రయాన నిరతులవలన జలవ్యక్తుల విషయమును వినియున్నాను. వానిలో స్త్రీపురుష భేదమున్నదనియు, వానిశరీరములు పైభాగమున నరాకృతిగాను నడుగుభాగమున మత్స్యాకారముగాను నుండునని చెప్పెదురు. ఆవ్యక్తుల దేహసౌందర్యమును, విన్యస్తకేశపాశములను, గాన శక్తిని పలువిధములుగ వర్ణించియున్నారు. వానిగానము నొకతూరి వినిన మాత్రమున మరియేవిషయమందును మనస్సు పోదట! ఇట్టి వింతమాటలను వినిన కొందరు గాన వ్యక్తినొకటిని సముద్రములో బట్టుకొని పరీక్షించిరి. అది మత్స్యజాతికి చేరిన యొకప్రాణియై యుండెనే కాని

భూతవ్యక్తిగా నగుపడలేదు. వర్ణవిశేషము వలనను, కుక్కవలె మొరుగు నభ్యాసమువలనను, దూరము నుండి చూచువారికి నరాకృతిగల సుందరమైన ప్రాణిగా దోచియుండవచ్చునని నిర్దేశింపబడెను. ఇట్టిది గాక జలతత్వమందు ప్రత్యేకముగ భూతవ్యక్తు లున్న యెడల వానిలో నొకటిని నేను చూడ నపేక్షించెద.

సాధువు:—నీవు వర్ణించినప్రాణి హాలికోర్ (Halicore) జాతికి చేరిన యొక మత్స్యమేకాని భూతవ్యక్తి కాదు. జలవాసముచేయు నావ్యక్తులు సులభముగా మానవులకు గోచరించవు. పట్టుకొనుటకు యత్నించిన నవి దొరకునవికావు. బహుభాగ మవి నరాకృతిగా నుండునుకాని నరదేహముకన్న సూక్ష్మతరమై సుందరతరమైయున్న దేహమును గలిగి యుండును. మనుష్యుడు వానినరుదుగా జూడగలడు. శాశ్వతమైన స్థూలదేహమును గల్పించుకొని భూమిపై నివసించుశక్తి వానికున్నది. ఒకప్రభు (Count Stauffen berg) పట్టి జలకన్యక నొకతె నాకస్మికముగా సంధించి యామె దేహ సౌందర్యమునకు మోహపడి పెండ్లియాడి ఒక సంవత్సర మామెతో ప్రణయసుఖము ననుభవించెను.

పిదప నొక మతమూర్ఖుడే తెంచి యామె పిశాచమని చెప్పుటచేతను, ఆమెకంటె సుందరతరమైన నొక కృషికుని కన్యకపై యాశకలిగి యుండుటచేతను ఆప్రభువాజలకన్యకనుద్యజించి కృషికుని కన్యను బెండ్లియాడెను. ఈవివాహమైన మూడవరోజున నాప్రభువు నూతన భార్యతో బవ్వళించియుండగా జలకన్యక గదిలో ప్రవేశించి యాప్రభువును జంపివేసి తన మత్సరమును దీర్చుకొనెను. ఇది పూర్వమున నడచినయొక వృత్తాంతము. జలకన్యకలప్రీతి దృఢమైనదిగను, అనన్యమైనదిగను, మత్సరయుక్తముగను నుండును.

జలకన్యకల విషయమును నాసాధు వతిశయముగా జెప్పినకొలది యొక కన్యకను జూడవలెనని పథికుని కాశ కలిగెను కాన నొకతెను తనకు చూపించుడని సాధుపురుషుని వేడెను. ఎన్నియో యుపాయములను జెప్పి పథికుని యాశను బోగొట్టవలెనని సాధుపురుషుడు యత్నించెను కాని వాడు తనపట్టును విడువలేదు.

సాధువు:—మన కావాసమైయున్న నీప్రపంచము పాప క్షేత్రమని తెలియుము. మనము మరియొక ప్రపంచ

నివాసులజోలికి పోవుట మంచిదికాదు. మన మింక ను పాపాత్ములమై విషయ విలోభములకు సులభముగ లోబడు వారమై యున్నాము. మానవులతో ప్రణయసుఖము ననుభవించుట జలకన్యకలకు సంతోషకరము. అందు నిమిత్తమై వారు సర్వదా పాటుబడుచుందురు. ఆకన్యకలకు శాశ్వతమగు నాత్మవస్తువు లేదు కాన మానవుల సంపర్కముచే నమరత్వము ననుభవింప నాశపడును.

పథికుడు—అట్టిప్రాణులను రక్షించుటకు తమ రేల సంశయించెదరు? ఒక్కకన్యకకైనను మనవలన నమరత్వము లభించిన మనకు సంతోషము కాదా? అట్లు చేయుట మహోపకారమనియు, కర్తవ్యమనియు నేను నమ్ముచున్నాను. ఒకవేళ, జలకన్యకయొకతె నా పత్నియై నామనస్సుకు తగినట్టు నడచుకొన సిద్ధముగా నున్నయెడల నేనగత్యముగా వివాహమాడెదను. జలకన్యకను పెండ్లియాడుట విశేషమైన భాగ్యము కదా?

సాధువు :—జలకన్యకను మానవుడు పెండ్లియాడిన నామె వాని మనోనువర్తియై యుండుటయేగాక చాల యణకువను జూపించును. తనభర్తను తనయుద్ధారకునిగను, దేవునిగను భావించుచు వానిం దృణీకరించక, ప్రతిఘటించకయుండును. తనభర్తయొక్కయాశలను, మనోభిప్రాయములను గుర్తెరిగి వానిం దృప్తి పరచుటకై యత్నించుచుండును. అప్పుడప్పుడు సముద్రతీరమునకు వెళ్లవలెనని యాశించుట తప్ప మరియేయాశలనుగాని, సుఖములనుగాని కోరదు. ఆమెను సముద్రతీరమునకు పంప వానికెటువంటి ద్రవ్యవ్యయము కానేరదు. ఆమె పోయివచ్చు విధానమే వేరు.

పొంగివచ్చుచున్న తన యాశను పథికుడు దాచుకొనజాలక పోయెను. చూర్ణమును దీసి ధూపము వేయుమని యతిదీనుడై వేడుకొనినందున నాసాధుపురుషు డెండుటాకులను నొక యగ్నిగుండములో వేసి కొద్దిగా బొగ్గులను జేర్చి మంటచేసి విచిత్రమైన నొక పొడిని దానిలో విదలించెను. కొన్నినిమిషములలో దానినుండి తెల్లగపొగలేచెను. అది మంచువలె నామం

దిరమును నావరించికొని సుగంధపరిమళము నిచ్చుచుం డెను. ఆమందిరమందున్న పరికరములన్నియు క్రమముగ నగోచరమగుచు వచ్చెను. గోడ లదృశ్యము లాయెను. వాయువు చలించుచు ఘనీభవించుట కారంభించెను. ఈవ్యత్యాసములవలన మనోవికారమును జెందక పథికుడు సంతోషోల్లాసములను జూపుచుండెను. తుదకు జలతత్వ మేర్పడి దానిలో తానున్నట్టు గోచరించెను. కోడియీక వలె తన శరీరము తేలికగానున్నట్టు స్ఫురించెను. శరీరము మునిగిపోవునను భీతి వదలెను. జలమందే పుట్టి జలమందే నివసించుచున్నవాడ ననియే వానికి దోచెను. తలపై నొక ప్రకాశము గోచరించెను. దాని కిరణము లలలపైనున్న బుద్బుదములలోను నురుగుకణములలోను పడి రజితమువలె మెరయుచుండెను. అవి రాకాచంద్రుని కిరణములై యుండెను. ఆయంబు రాసియొక్క తరంగము లలో పథికుడు స్వేచ్ఛగ క్రీడించుచుండెను. దూరమందా సముద్రముయొక్క గట్టు గోచరించుచుండెను. ఆ గట్టుపై నొక శైలమాల యుండెను. పరికించి చూడగా నది సింహాళద్వీపముయొక్క రేవులో కొలంబు గాలీ నగరముల వెనుకభాగమందున్న పర్వతశ్రేణిగా దోచెను. కొంత కొంత సంశయముండినను Adam's Peak అను

పర్వతశిఖరము గోచరము కాగానే నాసంశయము నివృత్తియాయెను.

రాకాచంద్రుడు ప్రకాశించుచున్న యాబంగాళాఖాతములో తానాచరించిన స్నానమును బథికుడెన్నడు మరచిపోలేదు. తన యభీష్టము సిద్ధించెననియు, తన స్థూలశరీరముయొక్క భారము తప్పిపోయెననియు వాడు సంతోషించెను. తన కాసన్నమైయున్న శరీరమునకును, తన స్థూలదేహమునకును భేదమే కనుపడలేదు. నీటిపై తేలుచుండులాగుననే వాయువులోను బహు తేలికగా సంచురించు శక్తి తనకున్నట్టు తోచెను. మందమారుతముచే దనకొక శబ్దము వినవచ్చుచున్నట్లు తోచెను. రానురా నాశబ్దము స్పష్టముగా వినబడుచుండెను. చెవినిచ్చి యాలకించెను. అతివిరళమైన గానమును బాడుచు, దరంగములలో యథేచ్ఛముగా క్రీడించుచు ముగ్గురు కన్యకలు తనవైపునకు వచ్చుచుండిరి. వారి క్రీడాలాపములు, విన్యస్తకేశపాశములు, బహుమనోహరములై యుండెను. కన్యకాత్రయములో మధ్యభాగమందున్న పూబోణి యతిసుందరగాత్రయై శిరమును జలతరులతో నలంకరించికొనియుండెను. పథికుని జూచి యొకచోట

నిలుచుండిరి. గానయుక్తములుగానున్న విచిత్రములైన భాషలనాడిరి. పథికున కవి యర్థము కాలేదు. వాని స్నేమును సంపాదించ యత్నించిరి.

తనతోఁగూడ తన హర్మ్యమునకు రావలెనని కన్యకాసుందరి పథికుని బ్రార్థించెను. ఆప్రాసాద మెచ్చట నున్నదని వాడు ప్రశ్నించెను. అంబురాసిమధ్యమున బ్రవాళశ్రేణిలో క్షీరమువోలె శుక్లవర్ణముగల ప్రవాళములతో తన యారామము నిర్మింపబడి యున్నదనియు, ధవళశంఖములకుడ్యములు నీలవర్ణపు తరంగములలో దళతళ మెరయుచున్నవనియు మానవుడెన్నడును చూడని యతిశయచిత్రము లచ్చోట నున్నవనియు నా కన్యకామణి వర్ణించెను. తాను నరుడుకాన జలతత్వమందు జీవించు శక్తి తనకు లేదని వాడుత్తర మిచ్చెను. సుందరగాత్రమైన రాజకన్యక నడుమువరకు లేచి మనోహరమైన శిరఃకంపనము చేయుచు వ్రేలాడుచున్న కేశములలో జలమయవజ్రములను బ్రకాశింపజేయుచు "నీవు నావెంబడి వచ్చుటకు వెనుదీయకుము. నీకేమి యపాయము సంభవించదు. నాప్రీతి నిన్ను కాపాడగలదు" అని పలికి పథికుని యాలింగనము చేసికొనెను. వానికి స్మృతి

తప్పెను. కామబాధచే వాని దేహము కంపించ నారం
భించెను. ఇసుక తిన్నెలలో బగులుచున్న తరంగములు
బహుదూరమందుండెను. పథికుని మనోరథము చేకూ
రెనుకాని యదియంతయు నొక నిమిషమాత్రమే యుం
డెను. వానికి స్మృతియే తప్పెను.

అష్టమాధ్యాయము సంపూర్ణము.

# సిద్ధాశ్రమము.

## నవమాధ్యాయము.

---

### పరిసమాప్తి.

పథికుడు మేల్కొనెను. నలువైపుల నవలోకించెను. విశ్రాంతికొరకు మున్ను తానాగియున్న దేవదారువనములో బాచిపై పరుండి యుండినట్లు తోచెను. సూర్యుడింకను పశ్చిమాద్రికి వెళ్లియుండలేదు. రెండు గద్దలు మాత్రము గగనమందు చక్రగతిగా దిరుగుచుండెను. వానిశబ్దము జలకన్యకయొక్క గానమువలె వినవచ్చుచుండెను. ప్రపాతమున కెదుట దుముకుచు ప్రవహించుచున్న జలప్రవాహము, దాని యడుగుభాగమున నురుగుతో నున్న జలాశయము మునుపటివలె గోచరించుచుండెను. జలబిందువు లెగురుచుండెను. పాచిచే దట్టముగా గప్పబడియున్న ప్రదేశమందు నీళ్లు ప్రవహించుచుండెను.

పథికుడు.—ఇదేమాశ్చర్యము ? నే నిదివర కనుభవించినది స్వప్నమా ? ఎంతయోమనోహరముగను యథార్థముగను నిదివరకు నేననుభవించినది నామెదడులో కలిగిన భ్రాంతిమాత్రమేనా? ఘోరతరమైన యీజాగ్రదవస్థయందుండుటకంటె జలకన్యకయొక్క యాలింగనమందే మృతినొంది యుండిన బాగుగనుండును కదా !

ఇట్లనుకొని పథికుడు పైకి లేచెను. వాని యంగీయొక్క గుండి రంధ్రమున నొక తెల్లని పుష్పము గోచరించెను. తననేత్రములను నమ్మజాలక యీ పుష్పమును హస్తముతో స్పృశించెను. అది నిజమైన పుష్పముగా నుండెను కాని శీతలప్రదేశమందు దొరకునదిగ నుండలేదు. మందోష్ణములతో గూడినవాయు సంచారము గల స్థలమందట్టి పుష్పములు పెరుగు చున్నవని స్ఫురించెను. స్వర్ణవిషయము స్మరణకు వచ్చెను. తనయంగీజేబులో హస్తమునుబెట్టి చూడగా కొన్ని వెండి ముక్కలు, యొక బంగారుగట్టియుండెను. ఆ గట్టి పదియారువన్నెల స్వర్ణముగానుండెను. ఏకాగ్రదృష్టితో జూడగా నెరసినపాడియొక్క కిరణములు గోచరించలేదు. తారకసాధువు పల్లెలోని తనబసకు పుస్తకమును బంపెదనని వాగ్దానము చేసిన సంగతి స్మరణకువచ్చెను. అతడు లేని కాలమందు

శుద్ధీకరణాలయములోని స్వభావరహస్యములలో మగ్నుఁడై జల కన్యకల విలోభములకు తాను లోబడియుండుట యవివేకమైన పనియని వానికితోచెను. తాను చేసిన్ని యవివేకమైన పనిచే దారక సాధువు యొక్క దయ తప్పిపోవుటకు కారణమేర్పడి యున్నది కాన నతడు పుస్తకమును బంపునో లేదో యని శంకించెను.

గ్రామాభిముఖుఁడై ప్రయాణముచేసెను. మునుపటి యట్లు త్రోవనడువక పక్షివలె పారుచుండెను. ఆప్రదేశము యొక్క మనోహరమైన స్వభావసౌందర్యమును గాని, అస్తమించు సూర్యుని కిరణ విశేషములు పర్వతాగ్రముపై ప్రసరించి స్వర్ణరేఖలవలె ప్రకాశించుచుండ మును గాని లక్ష్యముచేయక పథికుడు ప్రయాణముచేసెను. రాత్రితటస్థమాయెను. కొన్ని నిమిషములకు మునుపు బంగాళాఖాతమందు తాను చూచినట్టే రాకాచంద్రుడు గోచరించెను. ఆ రెండు ప్రదేశములకు కలుగు కాలవ్యత్యాసమును గణించెను. సూర్యుడాలంబుగిరిలో ప్రకాశించుచుండ చంద్రుడు బంగాళాఖాతమందు వెలుగుచుండెనని తీర్మానించెను.

శీఘ్రముగానడచుచు దన్ను జూచి యాశ్చర్యపడుచున్న జనులను గన్నెత్తిచూడక గ్రామవీధులగుండ తన

భోజనాలయమును జేరెను. మేడనెక్కి తనగదిలో బ్రవేశించెను. అచ్చట బల్లపై "దైవజ్ఞులగుప్త సంకేతములు" అను యమోఘమైన గ్రంథము సిద్ధముగానుండెను. ఒక విడికాగితముపై యిట్లు వ్రాయబడియుండెను.

"మిత్రుడా! నీవు బహు శీఘ్రముగ మా యాశ్రమమునుండి వెళ్లిపోయినందుకై విషాద పడుచున్నాను. మరల నిప్పుడే మావద్దకురమ్మని నిన్ను పిలువజాలను. శాంతమగు నీ ప్రవాతములో నివసింపదలచు వారింద్రియ విలోభములకు గాని, ముఖ్యముగ జన కన్యకలమోహమునకు గాని చిక్కకుండ యాత్మనిగ్రహమును గలిగి యుండవలయు. ఈ గ్రంథము ననుభవపూర్వకముగా వ్యాసంగముచేయుము. పరిధిని చదరముగా జేయుము. లోహములను దమనముజేయుము. వానిలోని కశ్మలమును దుడిచివేయుము. వీని నన్నిటిని నీవు సాంగముగా నెరవేర్చితివేని తిరిగి మమ్ములను బొందగలవు. నీక వసరమైనపుడు నేను నీవద్దయుండెదను." తారకసాధువు శ్రాంతుడైయున్నను పథికునకు నిద్రరాలేదు. ఆ సుదిన మందు తటస్థములైన ఘటనావళులను స్మరించికొనుచు నాగదియందే యటునిటు సంచరించుచుండెను. దృశ్యాదృశ్యములకును, బాహ్యాభ్యంతరములకును, స్వప్నజాగరములకును, మధ్యమందున్న రేఖను తెలిసికొనుటకు

యత్నించెను. అవి పరస్పరసాపేక్షములై యుండుటవలన వానిం బ్రత్యేకించుటకు సాధ్యముకాదనియు, నొకయవస్థలో బ్రత్యక్షముగా ననుభవమైనది మరియొక యవస్థలో స్వప్నప్రాయముగా నుండుననియు దీర్మానించికొనెను.

ఆగదిలో నొక పీటపై మత గ్రంథ మొకటియుండె ను. అది యాభోజనాలయము యొక్క యజమానుని దిగనుండెను. దానిం దెరచిచూడవలెనను యాశ వానికి కలిగెను. తెరువగా ద్వాదశాధ్యాయము తటస్థమా యెను. దానిలో నిట్లు వ్రాయబడియుండెను:—

" పదునాల్గు సంవత్సరములక్రిందనే నొక మనుష్యుని జూచియుంటిని (సూక్ష్మదేహములోనో లేక బయటనో నేను చెప్పజాలను). అతడు స్వర్గమునకు తీసికొనిపోబడి, వర్ణించుట కసాధ్యములైన మాటలను వినెనట. వానిని మానవుడు తన నోట నుచ్చరించుట న్యాయముకాదు."

నవమాధ్యాయము సంపూర్ణము.

---

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రితము:—1914.